గరుఢ పురాణ వచనము

3770

142 పేజ్ర

శ్రీరస్తు.

శ్రీ హయగ్రీవాయ నమః



శ్రీ

# గరుడపురాణవచనము.



శ్రీవేదవ్యాస మహాఋషి ప్రణీతంబును, అష్టాదశపురాణాంతర్గతంబును,
శ్రీవిష్ణు గరుడసంవాద రూపంబును, మోక్షసాధనంబయిన
సత్కర్మములను బోధించునదియునయిన
ఈ పురాణము, ఎల్లవారికి దెలియునటుల
సులభముగా తెనుగునందు

నే. వేంకటరామశర్మచే,
N. Venkata Rama Sarma.
రచియింపఁబడి,

క. వరదాచార్యులచే
చెన్నపురి :
ఆల్బినియన్ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
తారణ సం॥



దీని వెల అణాలు ౧

# శుద్ధపత్రిక.

| పుట. | పఙ్క్తి. | అసాధువు. | | సాధువు. |
| --- | --- | --- | --- | --- |
| ౫ | ౧౮ | ఇచ్ఛయ౦పగూడదు | ... | ఇచ్ఛయింపగూడదు |
| ౬ | ౧౮ | జీంచునవి | ... | జీవించునవి |
| ౮ | ౬ | భక్తుడుగు | ... | భక్తుడగు |
| ౮ | ౧౬ | బక్తితోచేసిన | ... | భక్తితోచేసిన |
| ౯ | ౧౧ | దేనవేవోత్తమా | ... | దేవదేవోత్తమా |
| ౧౧ | ౧౫ | తోవయందు | ... | త్రోవయందు |
| ౧౨ | ౨౦ | సద్వాఛ్రహ్మణులను | ... | సద్బ్రాహ్మణులను |
| ౧౩ | ౧౬ | ఆయుస్సు | ... | ఆయుస్సు |
| ,, | ౨౧ | ఆయుర్దామ | ... | ఆయుర్దాయము |
| ౧౪ | ౩ | ఎనుబదియారామష | ... | ఎనుబదియారామష |
| ,, | ౭ | యుగ్ని | ... | యగ్ని |
| ,, | ౧౨ | రెండదినము | ... | రెండవదినము |
| ,, | ౩౧ | దుఃఖకము | ... | దుఃఖము |
| ౧౯ | ౨ | గంధర్వరులు | ... | గంధర్వులు |
| ౨౧ | ౨౮ | పధదానము | ... | పదదానము |
| ౩౩ | ౧౦ | కనకు | ... | తనకు |
| ,, | ౨౭ | శాద్ధము | ... | శ్రాద్ధము |
| ౩౪ | ౪ | సగోత్రమునంగు | ... | సగోత్రమునంగు |
| ౩౯ | ౨౯ | చేనినట్టయిన | ... | చేసినట్టయిన |
| ౪౦ | ౧౯ | రాక్షలును | ... | రాక్షసులును |
| ౪౨ | ౨౫ | చేయబడుదున్నదో | ... | చేయబడుచున్నదో |
| ,, | ౨౯ | రుద్రేందాది | ... | రుద్రేంద్రాది |
| ౪౭ | ౧౭ | జంబూచ్వీపమనియు | ... | జంబూద్వీపమనియు |
| ౪౮ | ౧౫ | అంతదూరమంచును | ... | అంతదూరమందును |
| ౫౩ | ౧౪ | పూర్ణహుతి | ... | పూర్ణాహుతి |
| ౫౫ | ౧౪ | మూర్ధాడుచుండగా | ... | ముగ్ధాడుచుండగా |
| ౫౮ | ౨౨ | చంఖుచక్ర | ... | శంఖుచక్ర |
| ౬౨ | ౨౧ | యాసము | ... | యాసనము |
| ౬౭ | ౧౭ | పురాశ్రవణము | ... | పురాణశ్రవణము |

కొన్ని తావులయందు చేరు ధాతువునందుగల యలఘు రేఫమును లఘు రేఫముగా జూచుకొనవలయును.

# విషయసూచిక.

## అకారాది.

శ్రీ

శ్రీమద్వేదాంతగురవేనమః

శ్రీహయగ్రీవాయనమః

# శ్రీ గ రు డ పు రా ణ సా ర ము.



సమస్త కల్యాణగుణ స్వరూపుఁడై సకల ప్రాణుల యందున్ను తిలతైలముల వలె నిండియుండి లక్ష్మీనాయకుఁడై ప్రకాశించెడు శ్రీమహా విష్ణువు, ఆదికాలమందు ఈ పురాణమును గరుడునకు చెప్పుటచే నిది గరుడపురాణమని చెప్పఁబడుచున్నది. పిమ్మట నిది నైమి శారణ్యావాసులగు మహాఋషులకు సూత మహామునిచేత చెప్పఁబడి నది. ఈపురాణమునందు చెప్పునట్టి విషయము లేవనఁగా;— జీవము మరణమునొందు విధమున్ను, మరణమునొందినతర్వాత ఆజీవము వాయుశరీరమును వహించి యమదూతలతో యమలోకముచేరి, క్షణములో మరల తనశవముదగ్గఱకువచ్చి బాధచెందుట యున్ను, కర్మము చేయవలసినరీతియు, పదిదినములు వేయు పిండములచేత జీవము వేఱు శరీరముచెందుటయు, పదమూడవదినము యమదూతలు పిండశరీరమును వహించిన జీవమును పాశముతోకట్టి దినమునకు ఇన్నూట నలువదియేడు ఆమడలెక్కను ఒక సంవత్సరమువఱకును ఈడ్చుకొనిపోవు విధమున్ను, భూలోకమునకున్ను యమలోకమునకున్ను నడుమను ఎనుబదినాలుగువేల ఆమడత్రోవలోనుండెడు అసిపత్రవనము అనఁగా కత్తులవలె చుఱుకైనయాకులను కలిగినవనమున్ను, కరగించిన తామ్రమువలె ప్రకాశించెడు స్థలములున్ను, అపరిమితమగు నుష్ణశీతములుకలిగినచోట్లున్ను, అంధకారప్రదేశములున్ను, శిలావర్షము కలిగినచోటు లుండుటయును, చీముచేతను రక్తముచేతను నిండి పాపులకును, ఆపాపులను బాధించెడు పలువిధములయిన జంతువులకున్ను వాసస్థానమగు వైతరణియను నదియుండుటయును, యామ్యము, సౌరి, గంధర్వనగరము, శైలాగమము, క్రౌంచము, విచిత్రము, పక్వాపదము, దుఃఖదము, నానాక్రందము, సుతప్తము, శీతాభ్రము, అని చెప్పఁబడు పట్టణములయందు యమదూతల యాజ్ఞచే జీవుఁడు కొంతకాలమునిలచి మాసిక పిండములను భుజించుటయును, ముందు చెప్పిన వానిలో విచిత్రమను పట్టణముచేరి యాణ్మాసిక పిండములను భుజించి సప్తమమాసిక పిండమును భుజించు సమయమునందు కొన్ని పిశాచములచే నాపిండము హరింపఁబడుట యును, జీవము యమలోకమునకు సమీపమున వచ్చినతోడనే పిండశరీరమును వదలి

అంగుష్ఠప్రమాణమై యొక జన్మిచెట్టునందు కొంతసేపునిలచి కర్మవశమయిన శరీరము నొంది యమదర్శనము చేయుటయును, యమలోకస్వభావమును, యమునియొక్క నగరును, యమునియొక్క సభామంటపమును, చిత్రగుప్తుని నగరును, మహావ్యాధులయొక్క వాసస్థానములును, నరకములయొక్క పేళ్లు మొదలయిన వానియొక్క స్వభావములును, పాపముచేసినజీవులు రోకండ్లచేత మోదబడియు, ఆయుధములచేత ఛేదింపఁబడియు, సూరకత్తులచేత చెక్కఁబడియు, గానుగలలో త్రిప్పఁబడియు, అగ్నిలోతప్తము చేయఁబడియు, అగ్నితప్తమయిన లోహమయ స్త్రీ పురుష విగ్రహములతో చేర్పఁబడియు, గానుగలయందు చెరుకుగడలవలె నలగ కొట్టఁబడియు, నరకములయందు త్రోసి యను మంబడియు, ఇట్లు వారువారుచేసిన పాపానుగుణముగా దండనలను పొందుటయును పలాని పాపముచేసినవాఁడు పలానిజన్మ మెత్తుననియు, ఆయా పాపములనుచేసిన వాఁడు నరకమునుఅనుభవించి, ఆయాపాపములకుతగిన సూచకములతో జన్మ మెత్తునను టయు, పలానిపాపముచేత కౄరమైన ప్రేతజన్మము వచ్చుననుటయు, నిత్య శ్రాద్ధసంవత్సర శ్రాద్ధములుచేయవలసిన విధియును, కర్మముచేయకుండిన మరణము నొందిన జీవుఁడు కష్టముల ననుభవించి ప్రేతజన్మ మెత్తికులనాశముచేయుటయు;కర్మముచేయుటచేత చచ్చిన జీవుఁడు కష్టపడకపోయి సంతోషము ననుభవించి స్వర్గమునందు వాసము చేయుచు తనకులమువారిని యాశీర్వదించుటయు, పుణ్యముచేసిన జీవుఁడు సద్గతినొందుటయు, జీవుఁడు సద్గతినొందుటకు కారణమైన, భూదానము స్వర్ణదానము, గోదానము, ప్రత్తిదానము, శయ్యాదానము, అయదానము, తిలదానము, దీపదానము, లవణదానము, ఘటదానము, పదదానము, వృషోత్సర్జనము, నారాయణబలి మొదలగునవిచేయవలసిన విధులును, జాతాశౌచ మృతాశౌచ విధియును, దుర్మరణమునొందినవానికి యేకాలమందే విధముగా కర్మముచేయవలయుననుటయు, సన్యాసము, ప్రాయోపవేశము, సహగమనమను వీనియొక్క యాధిక్యమును, ఇదిగాక జీవునకు ఆధారమయినవియు, ముక్తిచెందుటకు సాధన మయినవియునైన విషయములు.



శౌనకాదిమహర్షులు. ౧ సూతమహామునులు

    

శ్రీ

సర్వం విష్ణుమయం జగత్.

శ్రీమన్నిగమాంతగురవేనమః

# శ్రీ గరుడపురాణవచనము.

పురాణ ప్రారంభము.

## మొదటి యధ్యాయము.

శ్రీమహాలక్ష్మి వసించు వక్షస్థలుఁడైన భగవంతునియొక్క నాభికమలమునందు పుట్టినట్టి బ్రహ్మదేవునిచేత సృష్టింపఁబడి విశాలమయిన యీ భూమండలమునందు తపోయోగ్యమై, పురాణములను పైరులు పండెడు సుక్షేత్రముగాను, వనశ్రేష్ఠమునై ప్రకాశించెడు నైమిశారణ్యమునందు వాసముచేయువారును, వేదవేదాంత పరిజ్ఞానులును, త్రిమూర్త్యాది దేవతలకు సమానులును, స్వరూపధ్యానులును, శ్రీహరికథాసంకీర్తన పరాయణులునైన శౌనకాది మహాఋషులను చూడనపేక్షించి పౌరాణిక శ్రేష్ఠుఁడైన సూతమహాముని యా నైమిశారణ్యమునకు నేతెంచి యచ్చటనుండు శౌనకాదులకు నమస్కరించి యమ్మునులు సంతోషముతో నొసఁగిన యాసనమునందు వినయముతో గూర్చుండెను.

తర్వాత నచ్చటి ఋషులందఱు సూతుని చూచి కరములు మోడ్చి హే సూతమునే తమచేత వైష్ణవ శైవపురాణములను విని మిక్కిలి సంతోషించితిమి. బ్రహ్మను గుఱించినవి రాజస పురాణములగుట చేతను, శివుని గుఱించినవి తామస పురాణములగుట చేతను, ఆదిదేవుఁడైన విష్ణును గుఱించినవి సాత్విక పురాణములగుటచేతను, ఆ విష్ణుపురాణమే తత్వమును బోధించునదియగుటచేతనట్టి విష్ణు పురాణమొక్కటిని మఱియు విన నపేక్షించియున్నాము. తామా భగవదంశాసంభూతుఁడైన వేదవ్యాస మహర్షి

యొక్క శిష్యులైయున్నారు, మఱియు నామహర్షి చేత బోధింపఁబడి నిస్సందేహు లయియున్నారు. తమకు తెలియనిది యేదియు లేదు. కరుణానిధియగు తాము ధర్మార్థకామ్య మోక్షముల నిచ్చునట్టి యొక సాత్వికపురాణమును మాకుఁ జెప్పవలయునని ప్రార్థించుచున్నాము. లోకమునందు జీవులకే యేకారణముల చేత జనన మరణములు సంభవించుచున్నవి? ఏయే కృత్యముల చేత స్వర్గనరకములు కలుగుచున్నవి? ఏకారణముచే తీరని వ్యాధులు కలుగును? ఎప్పుడు ప్రేత జన్మముకలుగును? దేనిచేత నాజన్మము తొలఁగును? దేనిచే మోక్షము సిద్ధించును? వీని నంతయు మాకు విశదముగా జెప్పవలయునని ప్రార్థించిరి.

తోడనే సూతమహర్షి వేదవ్యాసులయొక్క చరణములను మనస్సునందు ధ్యానించి, శిరమునందు కరములు మోడ్చి, సర్వజగత్కారణుఁడైన శ్రీమన్నారాయణుని స్తోత్రముచేసి, శౌనకాది మహామునులనుజూచి ఋషులారా సర్వజ్ఞులయిన మీరు చక్కగా నడిగితిరి, మీప్రశ్న కుత్తరమగునట్లు ఒకమేలైనకథ చెప్పుచున్నాను. సావధానులై వినుఁడు. బ్రహ్మ రుద్రాది దేవతలకు దేవుఁడైన వాఁడును, సర్వాంతర్యామియు, సృష్టిస్థితి సంహారములను లీలారూపముగా జేయువాఁడును, పురుషోత్తముఁడును, పరమపద వాసియునగు శ్రీమన్నారాయణుని మున్నొక కాలమునందు గరుడుఁడు నమస్కరించి మీరిప్పుడడిగిన రీతిగా లోకోపకారమయి యడిగి తెలిసికొనెను. వానిని చెప్పుచున్నానువినుండు. ఆ గరుడుఁడు భగవంతునింజూచి హే జగదీశా! లోకమునందు జీవులేకారణమున జననమరణములనొంది, స్వర్గనరకముల ననుభవించుచున్నారు? ఏ పాపముచేత ప్రేతజన్మము నొంది యేపుణ్యముచేత దానిని వదలుచున్నారు? ఏ కర్మముచే నిరతిశయానంద స్థానమగు నీయొక్క లోకమును పొందుచున్నారు? ముందు జేసిన పాపములను యేకారణముచేత మరణకాలమందు నివర్తింపఁబడి సద్గతిని పొందుదురు? పాపములన్నియు నే కర్మముచే తొలఁగును? మరణ సమయము నందెవరిని స్మరించిన మంచిగతికలుగును? వీని నంతయు నాకు దయజేసి చెప్పవలయునని ప్రార్థింపగా, ప్రభువును జలశయనుఁడును, జలస్వరూపుఁడును, సర్వహృదయవాసియయి సర్వమును చూచువాఁడును, సకల కృత్యములకు కారణుఁడునైన యాహరి కరుణించి గరుడునిచూచి పరాక్రమశాలియగు గరుడా చక్కని ప్రశ్న చేసితివి. నీవడిగిన వన్నియులోకమునందు రహస్యమయినవి, వానిని చెప్పెదవినుము. అనేక దినములు బ్రదికియు నొక్కనాడు చచ్చునది నిక్కమని యొక్కఁడైనను తలఁచుటలేదు. జననమయిన వెనుక మరణమున్నదని తలంచువాఁడు కోటికొక్కఁడుండునో లేడో? జీవమునాకర్షించునట్టి యముఁడొకఁడున్నాఁడనియు మరణకాలమందు వానిచేతనే

చిక్కువలయుననియు, పలుమాఱు తలచి భయపడువాఁడెవఁడో వాఁడొకఁడే కడచిన దినముల నెంచుకొని జీవితకాలమంతయు వ్యర్థమగుచున్నదనియు, యముఁడువచ్చునే అయ్యో! యేమిచేయుదుమనియు, భయమునొంది ధర్మము చేయును. ఒకఁడు తనకు తగినకర్మము చేయునేని యాకర్మము వానిగాచును. పలాని జాతియందు పుట్టువానికి పలాని కర్మములే చేయఁగూడునని వేద శాస్త్రములు చెప్పుచున్నవి. వాని నెఱిఁగితా బుట్టిన కులమునకు దగిన కర్మములను విడచి ఉత్కృష్ట నికృష్టజాతుల వారి కర్మములను చేయక తన జాతికి దగిన కర్మములనే యెవ్వఁడు చేయునో యట్టివాఁడెచ్చటను శ్రేష్ఠత్వమును వహించును.

బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను జాతులు నాలుగుగలవు. వారిలో బ్రాహ్మణులకు, దానముచేయుటయు, దానముతీసికొనుటయు, యాగముచేయుటయు, తగినవారికి చేయించుటయు, అధ్యయనము చేయుటయు, తగినవారికి చెప్పుటయునైన యారుకర్మములు తగినవి. క్షత్రియ వైశ్యులకు దానముచేయుటయు, యాగముచేయుటయు, వేదము నభ్యసించుటయునైన మూడు కర్మములు తగినవి. శూద్రులకు పైజాతివారుచెప్పిన కృత్యముల నణఁగిచేయుటయేతగినది. వారివారి జాతికితగిన యాచారము నందుండుటయే వారివారికి గొప్పతపమువంటిది. ఆతపస్సునందు తప్పక నడుచువారెవరో వారే భోగమును యోగమును పొంది చిరకాలము జీవించి అంత్యమందు సద్గతి నొందుదురు. కాఁబట్టి ఎల్లవారును వారివారికితగిన యాచారము నందుండుటయే శ్రేష్ఠమగును. ఎవ్వరైనను యేవస్తువును యిచ్ఛయుంపఁగూడదు ఎటువంటి గొప్పతపమునైనను యాయిచ్ఛ చెఱచును, ఆశావర్జితుఁడే బుద్ధిమంతుఁడగును, అనిచెప్పి మఱియు చెప్పుచున్నాఁడు.

మొదటి యధ్యాయము
సమాప్తము.

---

## రెండవ యధ్యాయము.

---

అక్కథకుఁడైన సూతుఁడు నైమిశారణ్య వాసులనుచూచి మఱియును చెప్పుచున్నాఁడు. పిమ్మట వాసుదేవుండు వైనతేయుఁడా! లోకమునందెను బదినాలుగు లక్షల యోనిభేదములుగలవు. అవి, అండజము, ఉద్భిజ్జము, జరాయుజము, స్వేదజములని నాలుగుభాగములుగానున్నవి. ఆనాలుగింటియందు గ్రుడ్డువలన పక్షులు మొదలుగా గల యిరువదియొకలక్షయును, భూమివలన వృక్షములు మొదలయిన యిరు

పదిరెండు లక్షయును, జరాయువను గర్భకోశమునలన మనుష్యులు మొదలయిన యిరువదియొక లక్షయును, చెమటవలన దోమలు మొదలుగా గల యిరువదియొక లక్షయును పుట్టును. జన్మములలో మనుష్య జన్మము మిక్కిలి దుర్లభము. ఆ జన్మమే పుణ్యాజన్మమగును. ఒక వస్తువును చూచుటకు కన్నులును, వినుటకు చెవులును, రుచిజూచుటకు నాలుకయును, గంధమును గ్రహించుటకు నాసికయు, విషయసుఖమునకు శరీరమును, మంచి చెడుగులను తెలియుటకుబుద్ధియు, కలిగియుండుటచేత, మానుష జన్మమే శ్రేష్ఠమగును. ఆ మనుష్య జన్మమునందు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, అని నాలుగు జాతులవారుగలరు. రజకులును, మాదిగలును, సాట్యమాడువారును, ఓడనడపువారును, అగసాలెవారును, పంచములును, బోయలునను, వీరు శూద్రజాతికంటె హీనులు. ఆహార నిద్రాభయమైధునములు సకల ప్రాణులకును సామాన్యములు. జ్ఞానము మాత్రమట్లు కానేరదు. కొన్ని దేశములయందు మనుష్యులు యేకపాదులుగాను, ద్విపాదులుగాను, యనేకపాదులుగాను ఉన్నారు. కృష్ణసారమనుజింక యే భూమియందున్నదో యాభూమి యే పుణ్యభూమియగును. ఆభూమియందు దేవతలను, మహా ఋషులను, పితృదేవలను, పూజించువారికి మిక్కిలి శ్రేయస్సుకలుగును. ఆ పుణ్య భూమియందు ముప్పదిమూడుకోట్ల దేవతలెప్పుడును వాసము చేయుచున్నారు.

భూతప్రేత పిశాచదేహముల నెత్తిన జీవులు శ్రేష్ఠులు. ఆజీవులయందు పశుపక్షి జన్మము లెత్తి, కొంతతెలివి గలిగి జీంచునవి శ్రేష్ఠములు. వానిలో మనుష్యులు. శ్రేష్ఠులు. ఆ మనుష్యులయందు బ్రాహ్మణులు మిగుల శ్రేష్ఠులు. ఆ బ్రాహ్మణులయందు వేద శాస్త్రజ్ఞులు శ్రేష్ఠులు. వారిలో వేదార్థములను సందేహములేక నిశ్చయముగా నెఱింగినవారు శ్రేష్ఠులు. అట్లెఱింగినవారిలో నెఱింగినట్లు నడచుకొనువారు శ్రేష్ఠులు, వారిలోను బ్రహ్మజ్ఞానులే మిగుల శ్రేష్ఠులగుదురు. అనేకకోటి జన్మములయందు పొందగూడని స్వర్గమోక్షములను పొందుటకు మనుష్య జన్మమే కారణమైనది. ఆ జన్మమును పొందియు సత్కర్మములనుచేసి మంచిగతిని పొందక నరకము నొందు దుష్కృత్యములనే చేయుచు నాజన్మమును వ్యర్థము చేయువారలే లోకమునందనేకులు గలరు. పుణ్యముచేత గలిగిన యీ మనుష్య జన్మముచేత ప్రయోజనము నొందని వారాత్మ ద్రోహముచేసిన వారగుదురు. దారేషణ, ధనేషణ, పుత్రేషణములయందు మనస్సుగలవాఁడై ధర్మములను తెలియక జీవించువాఁడెవఁడో వాఁడు మృగములతో సమానుఁడు, వానికంటె దుష్టుఁడులేఁడు. ఆశాబద్ధమైన మనస్సుగలవాఁడెంత మితిలేని సంపద దొఱకినను మఱియు నాశచేనలయునేగాని దొఱకినంతకు తృప్తినొందఁడు. నూఱు దొఱకినవాఁడు వేయికావలయుననియు, వేయి గలిగిన వాఁడు లక్ష కావలయు

ననియు, లక్షకలిగినవాఁడు కోటికానలయుననియు, కోటీశ్వరుఁడు దేశాధిపతిగావలయుననియు, దేశాధిపతి చక్రవర్తిగా వలయుననియు, చక్రవర్తియయినవాఁడు దేవత్వముగావలయుననియు, దేవతలు యింద్రత్వముగా వలయుననియు కోరుదురు. అట్లు ఆశ తానుతాను వృద్ధియగునేగాని యెన్నటికిని దాని విడుచుట దుర్లభము. ఆ యిచ్ఛను వదలనివాఁడు చూచినవారినెల్లాఁగి యాచించి వారిచే నిందింపఁబడి తుదకు నరకము నొందును. మహాకష్టములన్నియు యేకకాలమునందనుభవించుట కాయాశయేకారణమని యాయాశా మూలమును తెగగొట్టిన పెద్దలెవ్వరిచేతను నుతింపఁబడి యంత్యమందు స్వర్గలోకము చేఱుదురు. ఇంద్రియము లేగిన త్రోవను మనస్సును విడువక యామనస్సునణఁచి స్వతంత్రుఁడై యెవఁడుండునో వానికే సకలశ్రేయములు కలుగును. అట్లు స్వతంత్రములేనివాఁడు బాల్యమునందు తల్లిదండ్రులచేతను, యౌవనమందు భార్యచేతను, వార్ధిక్యమునందు పుత్రపౌత్రాదులచేతను దుఃఖము బొందును. వేణునాదముచే యానందము నొందెడి జింకబోయవానిచే పట్టుబడుటచేత నాజింక శ్రోత్రముచేతను, ఏనుఁగు మైథునాపేక్షియై స్త్రీయేనుఁగు వెంటజని గోతిలో బడుటచేత స్పర్శసుఖముచేతను, తేనెటీగలు మధుపానము చేయుటకు తేనెగూడబెట్టితుదకు వేటగాని నిప్పుమంటలో చచ్చుటచే జిహ్వచేతను, చేపలు మంటికొనయందుండెడు మాంసము యొక్క వాసనకై వచ్చి చచ్చుటచే ఘ్రాణముచేతను నాశము నొందును. ఇట్లొక్కొక్క యింద్రియముచేత నవి నాశము నొందునట్లయిన పంచేంద్రియములచే మనుష్యుఁడు నాశమునొందుటకు సందియముగలదా? సంసారమునందు సుఖదుఃఖములలో నెది యధికమయినను, దారాపుత్రుల నెడుపాశముచేకట్టఁబడిన మనుష్యుఁడెప్పుడును సద్గతి నొందఁడు. బాలుఁడైనను, యౌవనముగలవాఁడైనను, వృద్ధుఁడైనను గతదినములను లెక్కించు యముఁడొకఁడున్నాఁడని తెలిసినడచుటలేదు. లోకమునందు జనుఁడు పుట్టిపుట్టి చచ్చుచున్నాఁడు. ఇతరులకు తెలియకనెట్లు పుట్టునో యాప్రకారమే గృహదారా పుత్రులను విడచి యందఱు చూచుచుండగా చెప్పకనేగును. తల్లిదండ్రులు, దారాపుత్రులొక్కరును తోడులేక తానొక్కఁడు మాత్రమే తాను వచ్చిన రీతిగా పోవును. ఒకఁడు చచ్చినతోడనే వాని దేహమును భూమియందు కాష్ఠమువలె నుంచి బంధువులేడ్చుచును ఆ! హా! కారములో నేడ్తురు. వారలట్లు యేడ్చుట చేతచచ్చిన వానికేమి ప్రయోజనము? ఒకఁడుతప్పుపత్రముల వ్రాయుట, తప్పు సాక్ష్యము చెప్పుట, త్రోవదోఁచుట. హత్యచేయుట మొదలయిన దుష్కృత్యములనుచేసి ద్రవ్యము సంపాదింప నాద్రవ్యమును వానివారందఱు ననుభవింతురు. పైజెప్పిన దుష్కృత్యములచేత వచ్చునట్టి పాపమునందా ద్రవ్యమనుభవించు వారికిని భాగము కలదో యన్నఁగా లేశమయినను లేదు. అట్టి పాప కృత్యములనుచేసి యితరుల ద్రవ్యము నపహ

ంించినవాఁడెవఁడో వాఁడొక్కఁడే యాపాపమునకంతయు బాధ్యుఁడై క్రూరమయిన నరకముననుభవించును. అట్టి పాపకృత్యములచేత సంపాదించిన ధనమువాఁడు మరణము నొందిన తర్వాత వానితోనేగకనింటియందే యుండును. బంధువులు మొదలగువారు శవముతోడ శ్మశానమునకుఁబోయి మఱలి యింటికి తిరుగుదురు. బ్రతికియుండు నప్పుడు వాఁడుచేసిన పాప పుణ్యములు మాత్రమే వానితోపోవును. ఏధనమైతే నాభక్తుఁడుగు నొక బ్రాహ్మణునిచేత నివ్వఁబడదో యాద్రవ్యము దాని కధికారిదిగానేరదు. లోభియొక్క ధనము, తాను బ్రాహ్మణులకు దానము చేయఁబడకపోతినని యు, సేతుయాత్రలు మొదలగు వానికి సెలవు చేయఁబడకపోతిననియు, తన యజమానుఁడు దేహమునుక్రిమి, మలసంకులమని యెఱుఁగలేదనియు, వానికి వెనుక తన్నెవఁడు గ్రహించి యేవేశ్యచేతనిడ్చునో యనియు దుఃఖించును. పూర్వ జన్మమునందు దానధర్మము చేసినవాఁడే యిహజన్మమునందు మహాభాగ్యవంతుఁడగుటచేత, నిహజన్మమందు నాప్రకారమే చేసినట్లయిన రాగల జన్మమందును మిక్కిలి భాగ్యవంతుఁడగును. ఎవ్వఁడా దానధర్మమును భక్తి శ్రద్ధలతో చేయునో వాఁడే ధర్మార్థ కామ్య మోక్షములను పొందును. భక్తి శ్రద్ధావిహీనుఁడు ధర్మము చేయనివాఁడే యగును. దానధర్మములు చేయుటచేత కోరినవి కోరినట్లు సిద్ధించును. దుర్లభమయిన మోక్షమును సిద్ధించును. బక్తితోచేసిన ధర్మమణువైనను మేరువగును. ద్రవ్యహీనులగు ఋషులందఱు తమయొక్క మనశ్శుద్ధివలననే బ్రహ్మ రుద్రేంద్రాదులకు దుర్లభమయి, నిరతిశయానంద స్థానమగునాయొక్క లోకమును పొందుదురు. కాఁబట్టి మనశ్శుద్ధియును, భక్తియునులేక దానము, ధర్మము, తపము మొదలయినవిచేసిన, నవినిష్ఫలములగును. మోక్షసాధనములయిన భక్తి ప్రపత్తులను చేయుటయు, భక్తితో దానధర్మములు చేయుటయునే యుత్తమమగునని వక్కాణించెను.

రెండవ యధ్యాయము

సమాప్తము.

---

## మూడవ యధ్యాయము.

---

సూతపౌరాణికుఁడు, మునులారా! పిమ్మట గరుడుఁడు శ్రీమన్నారాయణుని గూని యాడిహేనాథా! మనుష్యులకు మిక్కిలి కష్టమగు ప్రేతజన్మము దేనిచేతరాఁకమానును? దానిని కటాక్షించి చెప్పవలయునని ప్రార్థించగా, సర్వాంతర్యామియగు

భగవంతుఁడు, ఓ గరుడా ! మనుష్యులు మరణము నొందినపిమ్మట చేయవలసిన కర్మములను కొన్ని చెప్పెదవినుము. ప్రేత జన్మమును పొందకుండుట కపేక్షించునట్టి యెల్లవారును మరణము నొందుటకు పూర్వమే తమచేతితో వృషోత్సర్జనము చేయవలయును. స్త్రీశూద్రులయినను దానిని తప్పక చేయవలయును. ఐదేండ్లవయస్సునకు మీరిన స్త్రీపురుషు లెవ్వరైనను గతించినట్టయిన వారికి ప్రేతజన్మము రాకుండుటకై కర్మము చేయువాఁడు వృషోత్సర్జనము చేయవలయును. వృషోత్సర్జనము చేయుట ప్రేతజన్మము రాకుండుటకేగాని వేఱుకాదు. జీవించియుండు కాలమందుగాని, గతించిన వెనుకగాని యెవ్వనికి వృషోత్సర్జనము చేయఁబడునో వానికి ప్రేతజన్మమురానేరదు. ఈ వృషోత్సర్జనమును చేయక నితరదానము లెవ్వి చేసినను, వ్రతములు చేసినను, యాగములు చేసినను ఆ ప్రేతజన్మము బాధింపకమానదని చెప్పెను.

గరుడుఁడు సర్వేశ్వరుని నమస్కరించి ఓ దేవదేవోత్తమా ! వృషోత్సర్జనము, మరణాత్పూర్వము యేకాలమునందు చేయవలసినది ? మరణమునకు తర్వాత నేసమయమునందు చేయవలసినది ? దానికి మఱియు ఫలము లెవ్వి ? వానినిజెప్పి కటాక్షింపవలయుననఁగా, భక్త పరాధీనుఁడైన భగవంతుఁడు, ఓ ఖగకుల సార్వభౌమా ! మరణము నొందినవాని గుఱించి వృషోత్సర్జనము చేయక నితరశ్రాద్ధములన్నియు చేసినను లేశమయినను వానికి ఫలములేదు. గతించిన పదకొండవదినమునం దెవనికి వృషోత్సర్జనము చేయఁబడదో వానికి ప్రేతజన్మము తప్పకవచ్చును. వృషోత్సర్జనము చేయఁబడినట్టయిన గతించినవాఁడు ప్రేతజన్మము నొందక పితృలోకమునుచేరును. ముక్తిక్షేత్రములయందు జచ్చువాఁడుయమునిచేత పీడింపఁబడక సద్గతిజేరును. వృషోత్సర్జన మెవ్వనికి చేయఁబడునో వాఁడు నయితమట్టిలోకమును జేరును. పుత్రుఁడైనను, భార్యయయినను, దౌహిత్రుఁడైనను, దౌహిత్రియయినను వృషోత్సర్జనము చేయవచ్చును. పుత్రుఁడుండిన నితరు లెవ్వరును చేయఁగూడదని చెప్పెను. వేదస్వరూపుఁడగు గరుత్మంతుఁడు ఓ వాసుదేవా ! పుత్రులు మొదలగు వారెవ్వరును లేని స్త్రీపురుషులు మరణము నొందిన, వారికి యుత్తరక్రియ లెవ్వరు చేయవలసినది ? కటాక్షింపవలయుననఁగా భగవంతుఁడు ఓ గరుడా ! పుత్రహీనుఁడు నరకమునేగాని సద్గతిని బొందఁడు. కాఁబట్టి యెట్టి సత్కార్యముచేసినైనను పుత్రునిఁగనవలయును. ఒకఁడు తనకై సత్కార్యములేవియు చేసికొనక మరణము నొందినను, అట్లు మరణము నొందినవానికి వాని యొక్క పుత్రులు కర్మముచేయకపోయినను వాఁడు రేయుంబగళ్లు క్షుత్పిపాసలతో బాధపడుచు లోకమంతయు బహుకాలమల్లాడి తర్వాత పురుగులు మొదలయిన జన్మములనెత్తి, తిరుగ మనుష్య జన్మమందు నీచుని గర్భమున బుట్టి పుట్టిచచ్చును. కాఁబట్టి

రోగముచేత పీడింపఁబడుటకును, ముసలితనమువచ్చుటకును, యింద్రియబలముడుగుట కును, ఆయువుతగ్గుటకును పూర్వమే తెలిసినవాఁడు తానంత్యకాలమందు సద్గతిని పొందుటకు సత్కార్యములను చేయవలయును. అట్లు చేయక వెనుకటికి చేయవచ్చునని తలఁచుట, యిల్లుకాలుసమయమునందు దాని నార్చుటకు బావి త్రవ్వ యత్నించుటకు సమానమగునని చెప్పెను.

మూడవ యధ్యాయము
సమాప్తము.

---

## నాలుగవ యధ్యాయము.

---

సూతుఁడు, మునులారా! వినతాపుత్రుఁడైన గరుడుఁడు సర్వేశ్వరుఁడైన భగవంతునివినయ పూర్వకముగా, ఓ పరంధామా! ఒకఁడు దానధర్మములు మనశ్శుద్ధి గలవాఁడై తనచేతితో చేసినట్టులయిన ఫలమేమి? వాని కొఱకు వాని పుత్రులు మొదలగువారు చేసినట్టులయిన ఫలమేమి? చేయునట్టి క్రమముదప్పినదానిచే ఫలమేమి? వీని నన్నియు విశదపడ జెప్పవలయుననఁగా, శేషశాయియగు భగవంతుఁడు వైనతేయా! మనశ్శుద్ధియు, దృఢమునులేక చేసినటువంటి నూఱుగోదానముల కెంత ఫలముగలదో అంత ఫలము మనశ్శుద్ధి గలిగి శాస్త్ర సమ్మతముగా నొక్క గోదానము చేసినఁగలుగును. ఒకఁడు గతించినవెనుక వాని గుఱించి చేయు లక్ష గోదానముల కెంతఫలమో అంత ఫలము వాని యంత్యకాలమునందు వేయి గోదానములచేత గలుగును. కాఁబట్టి మరణకాలమునందే గోదానము మొదలయినవన్నియు చేయుట మిక్కిలి శ్రేష్ఠమని తెలియుము. మంచి దానమును, మంచి పాత్రమును, మంచి క్షేత్రమును, యిచ్చునట్టి వాని మనశ్శుద్ధియు కూడియుండిన యెడల ఒక్కటి కోటియగును. తెలిసినట్టి పెద్దలకు చేయునట్టి దానము దినక్రమమున వృద్ధినొందును. దానము తీయువాఁడు త్తముఁడైన నిచ్చునట్టి వానికి యధిక పుణ్యము కలుగును. విషమును పోగొట్టు మంత్రమును, చలిని పోగొట్టు అగ్నియు తమ శక్తినిమాఱక యుండునట్లు దానము తీయునట్టి యుత్తముఁడును తన సత్కృత్యముచేత పాపరహితుఁడగును. ఉత్తమ ఫలమును పొందవలయునని కోరువాఁడు గోదానములు మొదలయినవి, వేదశాస్త్రజ్ఞుఁడైన యుత్తమ బ్రాహ్మణున కివ్వవలయును. ఆవేద శాస్త్రములు చదువకయు, సదాచారుఁ

డుగాకయు, బ్రాహ్మణుఁడను పేరుమాత్రముగలవానికి యిచ్చినట్టులయిన ఆగోదానము నొసఁగినవానికే నరకము నిచ్చును. అదియునుంగాక దానము దీయుటకు దగనివాఁడు తీసినట్టులయిన వాఁడు ఇరువదియొక్కతరము, నరకముననుభవించును. ఒక గోవును ఒక్కనికే దానము చేయవలయును. ఏకాలమందును ఒక గోవును అనేకుల కివ్వఁదగదు. అట్లు యిచ్చి దానము తీసినవారలు వాని నమ్మి యాద్రవ్యమును భాగించుకొనినను, ఒక్కొక్కరు ఒక్కొక్క నెలయుంచి కొనునట్లు వంతువేసికొనినను, దానమిచ్చిన వాఁడు వాని యేమతరములతోఁ జిరకాలము నరకమునందు వాసము చేయును. యోగ్యులకు భక్తి శ్రద్ధతో దానము చేసినవాడు ఆజన్మము నంగోలేక మఱుజన్మము నందో సందేహములేక ఫలము నొందుట చేత, అధనము పెట్టెలోనుంచి, తాళము వేసిన ద్రవ్యమునకు సరియగును. అధికధనవంతుఁడు గతించిన వెనుక వాని పుత్రులు తండ్రికి భక్తి శ్రద్ధలతో చేయు కృత్యములచేత న్వాఁడు పొందెడు సద్గతికంటె పుత్రహీనుఁడును, దరిద్రుఁడును స్వల్ప ధర్మమును భక్తి గలిగి తమచేతితో చేసినట్టులయిన మేలయిన లోకమును పొందుదురు.

ఓ గరుడా! ఊరిప్రయాణము పోవువాఁడు కట్టన్నము కొనిపోయినట్టులయిన తోవయందు కష్టములేక సుఖముగా పోవచ్చునుగదా? ఆప్రకారమే బ్రతికియుండు నపుడు అన్నదానము మొదలయినవి చేసినవాఁడు గతించినవెనుక ఆకలిదప్పులచేత బాధచెందక సద్గతినొందును. చేతనన్నపు మూటలేనివాఁడు త్రోవయందాకలిదప్పుల చేత బాధచెందురీతిగా దానధర్మములు తానుగా చేయనివాఁడు చచ్చిపోవు నప్పుడధిక కష్టములననుభవించును. పుణ్యక్షేత్రమునందు, పుణ్యకాలమున చేసినటువంటి సత్కృత్యము ఆజ్యముచేత నగ్నిహోత్రుఁడు వృద్ధినొందునట్లు వృద్ధిపొందును. పుణ్యస్థలము గాక యేస్థలమందైనను, పుణ్యకాలముగాక యేకాలమందైనను, వృషోత్సర్జనము చేసి, శీలములేనివానికి దానము చేసినప్పటికిని అవృషోత్సర్జనముయొక్క మహిమచేత నుత్తమక్షేత్రమునందు, ఉత్తమకాలమున, నుత్తముఁడైన బ్రాహ్మణునికి దానముచేసిననే ఫలమో ఆఫలమును తప్పక చెందును. మనుష్యుఁడు సద్గతి చెందుటకు మొదటి కారణము వృషోత్సర్జనమేయని తెలియుము. దేహమనిత్యమగుటచేత సత్కార్యములను రేపుచేయుదమ నెడు తలంపుమాని నిత్యమును కూడినంతవఱకు చేయవలయును. పుత్రవంతుఁడు తన చేతితో నొకధర్మమునుజేయక చచ్చినట్టులయిన సద్గతినొందనేరఁడు. పుత్రహీనుఁడు సత్కార్యములను తనచేతితోచేసి చచ్చినట్టులయిన మంచిగతి చెందును. యాగము చేయుటకంటెను, గోదానములు మొదలయిన మహాదానములు చేయుటకంటెను వృషోత్సర్జనము చేయుట మిక్కిలి యుత్తమమగును. కార్తికమాస

పౌర్ణమియైనను, ఉత్తరాయణ శుక్లపక్షమునందైనను, కృష్ణపక్షమునందైనను ద్వాదశియందైనను, మఱి యేపుణ్యదినమందైనను, పరిశుద్ధ మనస్కుఁడై యుత్తమ క్షేత్రమునందు, మంచి నక్షత్రమునందును మేలైన లగ్నమందును, వేదశాస్త్రముల తెలిసి చక్కని శీలురైన బ్రాహ్మణులను ప్రార్థన పూర్వకముగా పిలచి, జపము, హోమము మొదలయినవి చేసి, తన్ను పరిశుద్ధునిగా జేసికొని, నవగ్రహ పూజచేసి, పితృ దేవతలనర్చించి, పూర్ణాహుతిచేసి, మహావిష్ణునుగుఱించి శ్రాద్ధముచేసి, మంత్రజలము చేత నొక కోడెదూడను స్నానము చేయించి, వస్త్రము, చందనము, పుష్పములు, ఆభరణములు మొదలయిన వానిచే శృంగారించి పూజించి, నాలుగుపెయ్య దూడలతో డనాకోడె దూడను హోమాగ్నిని ప్రదక్షిణము చేయించి, ఉత్తరముఖముగా నిలచి యాకోడెదూడనుచూచి, ధర్మమే వృషభమయితివి, ఆదియందు బ్రహ్మ చేసృష్టింపఁ బడితివియని చెప్పి, చచ్చినవానికై, చేసినట్టులయిన, వానిగుఱించియు, కర్త తనకే చేసికొనునట్టులయిన తన్ను గుఱించియు దానితోక కొనను జలమును విడచి యానీ టిని శిరమునందు ప్రోక్షించుకొని, ఆవుదూడలతో నాకోడెదూడను స్వేచ్ఛగా విడువ వలయును. దీనికే వృషోత్సర్జనమని పేరు. వృషోత్సర్జనము గతించినవాని గుఱించి చేయఁబడినట్టులయితే తోడనే ఏకోద్దిష్టశ్రాద్ధము చేయనలయును. వృషోత్సర్జనము చేయకున్న ప్రేతజన్మము రాక మానదు కాఁబట్టి యావృషోత్సర్జనము చేయక యితరము లయిన సత్కార్యములను తనకు తానే చేసికొనినట్టులయినను, చచ్చినవెనుక పుత్రులు మొదలగువారు చేసినను వానివలన ఫలములేదని తెలియుము. మరణము నొందిన పదకొండవదినమందైనను, పండ్రెండవదినమందైనను సపిండీకరణమునకు పూర్వమే షోడశ శ్రాద్ధముచేసి సద్బ్రాహ్మణులను నిమంత్రించి, వారిని యర్చించి, పదదానము చేయవలయును. శక్తిపైని తామ్రసంపుటమునందు సాలగ్రామమునుంచి, వస్త్రము మొదలగువానిచేత నలంకారారాధనములుచేసి, సద్బ్రాహ్మణునికి దానము చేయవలయును. వైతరణియనునదిని సుఖముగా దాటుటకై చెఱకుచేత నావనుజేసి దాని పట్టుతోనలంకరించి, నేతితో కాంస్యపాత్రను దానియందుంచి, శ్రీమన్నారా యణుని యర్చించి యాఓడను బ్రాహ్మణునకు దానము చేయవలయును. తిలలును, ఇను మును, స్వర్ణమును, ప్రత్తియు, లవణమును, నవధాన్యములును తప్పక బ్రాహ్మణుల కివ్వ వలయును. చేయునటువంటివాఁడు బీదవాఁడైన, వానిలో నొక్కటిని యిచ్చినను చాలును. తనశక్తికిఁదగిన ద్రవ్యముతోగూడ తిలదానమును, శయ్యాదానమును చేయ వలయును. ఈరెండు దానములకును దక్షిణ యధికముగానిచ్చి బ్రాహ్మణులను తృప్తి నొందింపవలయును. శయ్యాదానము తీసికొను బ్రాహ్మణునియాశయ్య పైనుంచి దానము చేయుట మిక్కిలి శ్రేష్ఠము. పుత్రహీనుఁడై చచ్చినవానికి పౌత్రుఁడు మొద



చిత్రగుప్తుడు యమధర్మరాజు ౭ యమకింకరులు

లగు వారెవ్వరైనను ఈవిధముగా జేసినట్టులయిన సద్గతి గలుగును. తన శక్త్యాను సారము నిత్యదానము చేయువాఁడెవఁడో వాఁడంత్యమునందు సద్గతి జెందును. శరీరము దృఢముగా నుండునప్పుడే సేతుయాత్రయును చేయవలయును. మాతాపితలు గతించినవెనుక ప్రతి సంవత్సరమును వారికి శ్రాద్ధము చేయవలయును. తల్లి, తండ్రి, ఆచార్యుఁడు వీరలకై తనవల్లనైన ధర్మమును చేయవలయును. చచ్చినవారికై కర్మము చేయుకాలమందు బ్రాహ్మణుల కెవ్వఁడు భూరిదక్షిణలనిచ్చునో వాఁడు కోరినవి యన్నియు సిద్ధించును. వాఁడు ప్రేతజన్మము నొందఁడు. సన్యాసులు, యోగులు మొదలగువారు యేలోకమును చెందుదురో ఆలోకము వానికి సిద్ధించును. మరణము నొందిన తర్వాత చేయవలసిన వాని గురించి యొకవిధముగా నీకు చెప్పితినని వక్కాణించెను.

నాలుగవ యధ్యాయము

సమాప్తము.

---

## ఐదవ యధ్యాయము.

---

శ్రీవేదవ్యాస శిష్యుఁడగు సూతమహాముని నైమిశారణ్యవాసులను జూచి, సద్గుణగరిష్ఠులగు ఋషులారా! గరుడుఁడు లక్ష్మీనాయకుని స్తుతిచేసి సర్వలోకశరణ్యా! యమలోకము ఎంతదూరమందున్నది? దానియొక్క స్వరూప మెట్టిది? నాకుంజెప్ప వలయునని యడుగఁగా, భగవంతుఁడు గరుడా! వినుము, మనుష్యలోకమునకును, యమలోకములకును నడుమ ఎనుబదియాఱు వేలామడల దూరము గలదు. ఆలోకమునందు వసియించుయముఁడు ఆయుస్సు ముగిసిన జీవుని పట్టుకొనివచ్చుటకు ఎవ్వరును భయ పడదగిన ఘోరరూపముగలవారును, అగ్నినిడ హింపజేయునట్టి కోపము గలవారును, పాశమును, ముసలాయుధమును ధరించినవారును, మేఘమునంటి నల్లని వస్త్రమును గట్టినవారలునైన ముగ్గురు దూతలను యెచ్చటకైనిని పంపుచున్నాఁడు. ఆముగ్గురు చని ఆయువు దీఱిన జీవుని పట్టి, వాయుశరీరము నంటారోపింపజేసి తీసుకొనిపోయి యమధర్మరాజు ముందరనిలిపి, ఓధర్మరాజా! మీయుత్తరువు చొప్పున నాయుర్దాము దీఱినవాని మీసన్నిధికి కొనివచ్చితిమి యిక మేము చేయవలసినదేమి? అజ్ఞాపింప వలయునని వినయములోనడుగుదురు. మహిషవాహనుండగు యముఁడు దూతలను

జూచి కింకర్లులారా ! మంచిది యాజీవుని మరల తీసికొని పోయివాని గృహమునందు విడచి పంద్రెండవ దినమునకు వెనుక క్రమముగా నాని నావద్దికి కొనిరండని చెప్పును. దూతలది విని, క్షణములో నాజీవుని తీసికొని యెనుబదియారామడదూరము నడచి వచ్చి చేరుదురు. వచ్చిన వెనుక జీవుఁడు యమపురికిఁబోయి మరల వచ్చుటచేత, శరీరమునుతోడనే దహనము చేయక కొంతసేపు కడచిన పిమ్మటనే దహనము చేయవలయును. యమదూతలచే గ్రహింపఁబడిన వాయు శరీరముగల యాజీవుఁడు, చితికి పదిమూరల దూరమునందు నిలిచి యగ్నిచే తగలబెట్టఁబడి జ్వాలలెగయు తన శరీరమును జూచి అయ్యో ! అయ్యో ! అని కూయును. ఆజీవుఁడు పుణ్యముఁజేసినవాడయిన నీ శరీరమును విడుచుటయే మంచిది యని సంతోషించును. శిరస్సు దగ్ధమగునంతవఱకు జీవునికి యాశరీరమునందాశవదలదు శిరము మొదలుగాగల శరీరమంతయు కాలిభస్మమయినతోడనే జీవునికి పిండము వలన శరీరము కలుగును. పుత్రుఁడు మొదటి దినమునందు వేయుపిండముచేత శిరమును, రెండవదినము పిండముచేత కంఠభుజములును, మూడవనాటి పిండముచేత వక్షమును, నాలుగవదినము పిండముచేతను దరమును, ఐదవనాటి పిండముచేత నాభియు, ఆఱవనాటి పిండముచేత పిఱుదులును, ఏడవనాటి పిండముచేత గుహ్యమును, ఎనిమిదవదినము పిండముచేత నూరువులును, తొమ్మిదవదినము పిండముచేత కాళ్లును గలిగి పదియవదినము పిండముచేత శరీరమంతయు పూర్ణమగును. జీవుఁడు చచ్చుటకు పూర్వము తాను దారాపుత్రాదులతోనుండిన గృహమునకువచ్చి లోపలికిఁబోక క్షుత్పిపాసలచే, ఆ ! హా ! యని కూయుచు, వచ్చుచు పోవుచున్న వారలను జూచుచు, నాయింటివాకిటనే నిలచును. తర్వాత నాజీవుఁడు పదకొండవదినమందును, పంద్రెండవ దినమందును పుత్రునిచే బ్రాహ్మణుల కివ్వఁబడిన దానిని భుజించి, పదమూడవ దినమందు యమభటులు పాశముచేగట్టి యీడ్వఁగా ఇంటిని తిరిగి తిరిగి జూచుచు, కూయుచునే యమలోకమును సమీపించును. ఆదూతలతో దినమునకు ఇన్నూటనలువది యేడామడ దూరము రేయుంబగలును నడచును. వాఁడు నడచునట్టి మార్గమునందు కత్తులవంటి యాకులను గలిగినది యగుటచే అసిపత్రవనమని యెడుపేరుగల యొక యడవిగలదు. వృక్షములు క్రిక్కిఱిసియుండు వనమునందు నడచుట యెవ్వరికైన కష్టమగునుగదా ? నూరుకత్తులవంటి యాకులుగల వనమందెట్లు నడువవచ్చును ? అదియునుంగాక వనమధ్యమునందు బోవునప్పుడు ఆఁకలి దప్పులచేతను మిక్కిలి బాధపడును. మార్గమునందు జీవుఁడు పొందు కష్టములను చెప్పుట కెవ్వరికి సాధ్యము ? అదియట్లుండ యమునియొక్క పట్టణము ఉన్నతములయిన మేడలచేత క్రిక్కిఱిసినదియు, ఎవ్వరికైన భయంకరమయిన ఘోరరూపము గలిగిన యనేక ప్రాణులకు వాసస్థానమయినదియు, దుఃఖకమునే యిచ్చునదియునై యున్నది. పాపము



పిండోత్పత్తియైనశరీరం ౬ యమదూతలు

చేసినవారనేకులు బ్రహ్మాండము పగులునట్లు సర్వదా ఆ! హా! యని యచ్చట మొఱబెట్టుచుందురు. అచ్చట వేడిమిచేగలిగిన మృగతృష్ణ నీరుండునట్లుతోచును. త్రాగుటకు బొట్టైన దొఱకదు. మేఘములన్నియు త్రాగగూడని రక్తము మొదలయిన వానినే వర్షించును. పైజెప్పిన రీతిగా పదమూడవదినమందు కోతిని త్రాటితో గట్టి యీడ్చుకొని పోవునట్లు కింకరులు పదియవనాటి పిండముచేత శరీరము నొందిన జీవుని పాశముచే బంధించి యీడ్చుకొనిపోవునప్పుడు, జీవుఁడు తన పుత్రుని తలఁచి అయ్యో! నాప్రియమయిన బిడ్డా! కష్టపడుచున్నానే, యేమి చేయుదును! యేమి చేయుదును! సర్వేశ్వరుఁడొక్కఁడున్నాఁడనియు, సత్కర్మ దుష్కర్మములు గలవనియు, స్వర్గ నరకములును, వాని జెందుటకు సన్మార్గ దుర్మార్గములు గలవనియు, హితముచెప్పిన వారిని భ్రాంతిగలవారని సాధువులను పరిహాసము చేసితినే, వాని ఫలము నిప్పుడనుభవించుచున్నాను. పర్వతములవంటి సమ్మెటలచేత కింకరులు దయలేక మోదుచున్నారే, అయ్యో! పెద్దలకే యుపకారమును జేయకపోతినే, చేయువారికైను తోడ్పడకపోతినే, తీర్థయాత్రలు చేయకపోతినే, చేయునట్టివారినైనను పొగడనైతినే, మేలైన తపస్సుచేయకపోతినే, చేయుపెద్దలనైన నుపచరింపకపోతినే, జలశూన్యమగుస్థలములయందు చలిపందిళ్లు వేయకపోతినే, ఒక తటాకమునైనను బావినైను త్రవ్వింపనైతినే, పశువులకు పచ్చికనిమిత్తము కొంతనేలను పైరుపెట్టక విడచిపెట్టనైతినే, సాధ్యమయినమట్టుకు నిత్యదానము చేయకపోతినే, వేదశాస్త్రముల నభ్యసింపక పోతినే, శ్రీమద్రామాయణ భారత భాగవతములను చేతితో వ్రాసియయినను, వ్రాయించియయినను, క్రయమునకు తీసియయినను చదువనపేక్షించువారికి యివ్వకపోతినే, వానిని పఠనము చేయనైతినే, పెద్దలగుండావిననైతినే, సర్వజనులకు వినిపింపకపోతినే, శ్రీహరివాసరమగు ఏకాదశియందుపవాసము చేయనైతినే, ఈవిధములయిన సత్కార్యముల నొక్కటిని స్వప్నమందైనను స్మరింపకపోతినే, దుష్కార్యముల నొక్కటియయినను విడువక నన్నియుజేసితినే, ఇప్పుడు యేమిచేయుదునని యేడ్చుచుపోవును.

ఐదవ యధ్యాయము

సమాప్తము.

## ఆఱవ యధ్యాయము.

సూతుఁడు శౌనకాది మహాఋషులను జూచి భగవద్భక్తులారా! తర్వాత సర్వేశ్వరుఁడు ఖగేశ్వరుని జూచి యోగరుడా! యమదూతలచేత కట్టఁబడియు, కొట్టఁబడియు పోవునట్టి జీవుఁడు దారాపుత్రాదులతో జీవించిన సుఖమును తలఁచి, దుఃఖించి, క్షుత్పిపాసలచే బాధనొంది, కృశించి, హీనమగు స్వరములో అయ్యో! మన పెండ్లాము బిడ్డలెక్కడ? పరిచారకులెక్కడ? ఎల్లవారును మనల నొంటరిగా విడిచిరే, తప్పు పత్రములను వ్రాయుట మొదలగు దుష్కార్యములనుచేసి యపహరించిన ద్రవ్యము యిపుడు మనచేతనున్నదా? ఆద్రవ్యముననుభవించెడు మనదారాపుత్రాదులు, చుట్టములు నెవ్వరైన నొక్కరు ఒంటరిగాబోవు మనతోడవచ్చిరా? మనలను మాత్రము విడిచి వారలు యింటియందు సుఖముననుభవించుటకై మనమేల పరుల సొమ్మునపహరించితిమి? నేను చేసిన వంచనలను కొంచెమయినను తెలియక నన్ను నమ్మి, జీవాధారమగు ధనమును పోగొట్టుకొన్నవారి కడుపు మండునట్లు నాకడుపు మండుచున్నదే! యేమి చేయుదునని తాను పూర్వము చేసిన దుష్కార్యముల నెన్నుచు యేడ్చుచుండును. అప్పుడు యమదూతలు వానిదవడలయందు కొట్టి, ఒరేమూఢా! ఇప్పుడే బుద్ధివచ్చినదో? దారాపుత్రాదులేగతియని, ధర్మముచేయక, పాపముచేసి బ్రతికితివే? వారు యిప్పుడు నీకు చేయుసహాయ మేమి? నీవు చేసిన పుణ్యాపాపములే నీకు సుఖదుఃఖములనిచ్చుచున్నవి. పరులసొమ్ము నపహరించుట మొదలగు నధర్మములుచేయక ధర్మముచేసినట్టులైన నీకేల యీచేటువచ్చును? మాచేత తగులుకొని యేల మిణుకరించెదవు? అని పిడుగువంటి శబ్దముతో నదల్చి, పట్టియు పాశముచేకట్టి, ముసలముచే మొత్తుదురు. ఓగరుడా! దుష్కృత్యములను చేసినవారిగతినిజూడుము. తర్వాత నాజీవుఁడు కొంతదూరము వాయుమార్గమందును, కొంతదూరము భూమార్గమందును యమదూతలతోనేగి యొకచోటనిలిచి మరణము నొందిన యిరువదియెనిమిదవ దినమందు పుత్రునిచే చేయఁబడు ఊనమాసిక శ్రాద్ధపిండమును భుజించి, ముప్పదియవదినము యామ్యమను నగరముచేరును. ఆపట్టణమందు ప్రేతసమూహములు మిక్కిలిగానున్నవి. పుణ్యభద్రయను నదియును, వటవృక్షమొక్కటియును గలవు. కొంత విశ్రాంతికొఱకు యమకింకరుల యుత్తరువుచేత నాయామ్యమను నగరమునందు నిలిచి, రెండవమాసిక పిండమును భుజించి రేయుంబగలును దూతలచే నీడ్వఁబడి, యెవ్వరికిని భయంకరమగు నడవినడుమపోయి, మార్గాయాసముచేతను దూతలుచేయు బాధచేతను, దుఃఖముతో మొఱబెట్టుచు పోవుమార్గమునందు త్రయపక్షికమాసిక పిండమునుతిని, సంగముఁడనియు, కాలదూషకుఁడనియు పిలువఁబడెడు ఒకరాజుపాలించు




(ప్రేతగుంపులు) (వటవృక్షము)



పిశాచులు  పిండశరీరమైజీవుఁడు.  యమకింకరులు

౨

స్సౌరియనెడునగరముచేరి, యాపట్టణమునందు మూడవమాసిక పిండము భుజించి, యావలనడచి, గంధర్వ నగరమను పట్టణముచేరి, యచ్చోట నాలుగవమాసిక పిండమును భుజించి, యావలమార్గమునందు సహింపగూడని చలిచేత మిక్కిలి బాధపడును. అచ్చట యమదూతలనేకులుగూడి దుఃఖపడునట్టి యాజీవుని పైశిలావర్షమును వర్షింతురు. జీవుడు ఆశిలావర్షముచేత బాధజెంది, క్రూరుడనుపేరుగల రాజుచేనేలఁబడు క్రూరమను నగరముచేరి, యచ్చట యయిదవమాసిక పిండమును భుజించి, యవతల నడచి, క్రౌంచమను నగరముచేరి, యచ్చట యారవమాసిక పిండమును భుజించి, యఱుముహూర్తకాలమచ్చట విశ్రాంతిచేసికొని మరల మిక్కిలి భయంకరమగు మార్గమునందునడచును. త్రోవను పోవునప్పుడు తాను పూర్వమును భవించినవానిని తలఁచి యేడ్చును. యమభటులు కోపించివాని నోటిమీఁద కొట్టుదురు. పలుమారు జీవుఁడు యమభటులచే బాధజెంది దుఃఖముతో బోవుచుండఁగా, మార్గమునందు ఓడనడపువారనేకవేలమంది భయంకరరూపముతో నాజీవునియెదుట నిలిచి, నిష్ఠురాల వీక్షించి ఓ జీవుఁడా ! వైతరణి గోదానము నిన్నుగురించి చేయఁబడినట్టులయిన నీవైతరణీనదిని నీకు కష్టములేక దాటనిత్తుము. లేనియెడల ఆనదిలోనిన్ను త్రోసి పాతాళమునకును నణఁచి బాధింతుము. ఓ జీవుఁడా ! ఆవైతరణియనునది నూఱుయోజనముల వెడల్పుగలది, జలములేక చీమునెత్తుటిచేత నిండియుండునది. అదియునుంగాక నుపద్రవించునట్టి దుష్టప్రాణులకు స్థానమయియున్నది. వాసన నెఱుఁగనట్టి ముక్కులేని ప్రాణియును దానిదుర్గంధమును సహించుటకష్టము, ఓజీవుఁడా ! నీచేతితో గోదానము చేసినవాఁడవైతివేని, యొకగోవువచ్చి నిన్ను యీనది కడ్డలజేర్చును, చేయనివాఁడవైతివేని యాగోవురానేరదు, నీవు యీనదియందు పడి చిరకాలము మునిఁగియుండవలయును.

ఓవైనతేయుఁడా ! వైతరణినదిని సుఖముగా దాటుటకు ఎవ్వరును తప్పక గోదానము చేయవలయును. జీవుఁడు ఆవైతరణీ గోదానము చేసినవాఁడైనను, వాని గురించి పుత్రులచే చేయఁబడినదైనను, ఆజీవుఁడావైతరణీని దాటి, యమధర్మరాజు సహోదరుఁడగు విచిత్రుఁడను వానిచే పాలింపఁబడు విచిత్రమను పట్టణమును చేరి, ఊనషాణ్మాసిక పిండము భుజించిపోయి, ఏడవమాసిక పిండమును భుజించుతఱి కొన్ని పిశాచములు వచ్చి యాజీవునిచూచి, ఓరిమూఢా ! భూమియందు జీవించునప్పుడు నిన్ను యాచించినవారికేమియు నివ్వక దూషించితివే యిప్పుడీపిండము నిమ్ము అని బలవంతముగా పెఱికికొనును. ఒక్కటియులేని దరిద్రుఁడైనను, తన్ను యాచించినవానికి లేదని చెప్పక తనకు సాధ్యమయినంతమట్టునకు యేదైన నివ్వవలయును. అట్లు యివ్వక పోయినట్టియిన పుత్రునిచే నివ్వఁబడిన పిండమును పిశాచములు పెఱికికొనును. తర్వాత

నాజీవుఁడు దుఃఖించి ఆ పిశాచములు పెఱికికొనఁగా తన చేతియందు రాలిన పిండశేష
మును భుజించి, అయ్యో! అడిగినవారికి యివ్వనిఫలమా యిది? త్రోవనడచి వచ్చితిని,
ఆకలి యెత్తుచున్నదియనువారికి యరకడుపన్నమైనను పెట్టితినా? పురమునను నది
యొకటి నిశ్చయముగానున్నదని తలఁచితినా? అని దుఃఖించును. అప్పుడు యమ
దూతలు జీవునిచూచి మూఢా! మనుష్యజన్మము జీవునికి కోరిన వన్నియు నిచ్చు
నటువంటి కల్పవృక్షమని చెప్పఁదగినది. మనుష్య జన్మము నొందిన జీవునకు అసాధ్య
మెద్ది? భూమియందా జన్మముచే మనుష్యునకు కావలసిన శుభములన్నియు చూచు
కొనవచ్చునే దానిని తెలియక చెడితివే మనుష్యజన్మముచే భూమియందు చేసిన సత్కర్మ
దుష్కర్మములయొక్క ఫలమును యితరలోకములయందు అనుభవింప వచ్చునేగాని
ఆలోకములయందు దేనిని చేయఁగూడదు. ఉత్తమలోకమును పొంది సుఖమను
భవించుటయు, అధమలోకము నొంది కష్టమనుభవించుటయు, భూమియందు పల్లకి
యెక్కుటయు, దానిని మోయుటయును, ఆభూమియందు చేసిన పుణ్యపాపముల
ఫలమేయని తెలియుము. దానిని యిప్పుడు తెలిసి యేమిచేయఁగలవు అని చెప్పుదురు.
గరుడా! జీవుఁనిచే నుదకకుంభదానము చేయఁబడియుండినట్లయిన, ఆనీటిని త్రాగి
కొంత శ్రమతీఱి, ఏఁడవమాసమునం దావలనడచును. జీవుఁడప్పటికి సగము త్రోవపో
యెనుగాన నామాసమునందు బ్రాహ్మణుల కన్నదానము చేయవలయును. తర్వాత
జీవుఁడు పక్వాపదమను పట్టణము చేరి, యెనిమిదవ మాసికపిండమును భుజించి,
అచ్చటనుండి వెడలి దుఃఖదమను నగరమును చేరి మహాద్దుఃఖము ననుభవించి, తొమ్మి
దవ మాసికపిండమును భుజించి, దానివిడచి, నానాక్రందమను నగరమును చేరి, పది
యవ మాసికపిండమును భుజించును. వృషోత్సర్జనము చేయకుండుటచే ననేక జీవులు
ప్రేతజన్మముతో గుంపులుగుంపులుగా నాపట్టణమునందు యెల్లప్పుడును ఓ! హో!
యని కూయుచుండుదురు. వారినిచూచి యాజీవుఁడును ఏడ్చి, యవ్వలనడచి, సుతప్త
మను నగరమును చేరి, పదకొండవ మాసికపిండమును అచ్చోట భుజించిపోయి, శీతా
భ్రమను పట్టణమును చేరి, యచ్చట చలిచేబాధజెంది, పండ్రెండవ మాసికపిండమును
భుజించి, యచ్చటినుండి బయలువెడలిపోయి దుఃఖములో నలుదిక్కులయందుండెడు
యమదూతలను చూచి, కింకరులారా! నాభార్యాపుత్రులొక్కరును లేరు. దీనవాఁ
డను నేనేమిచేయఁగలను అని చెప్పును. యమదూతలు జీవుని జూచి, మూఢా! పెం
డ్లాము బిడ్డలు యిచ్చటను గలరా? వారిమీఁదియాశ యింకను విడువలేదా? నీవుచేసిన
పుణ్యపాపములయొక్క ఫలమునే యిచ్చట చూతువని చెప్పుదురు. జీవుఁడదివిని
అయ్యో! మునుచేసిన పుణ్యము అల్పముగుటచేతగదా యీదుఃఖము పొందితినని
మనస్సునుందు నడచి, యమపట్టణము చేరుటకు పూర్వమే ఊనాబ్ది మాసికపిండమును

భూమిలోని యీపట్టణము చేరును. ఆయమపురము నూటనలుబదినాలుగామడ వెడలుపు గలదియయి, గంధర్వులు, అప్సరసలు వీరితో గూడినదియయి, ఎనుబదినాలుగువేల ప్రాణులను గలిగి ప్రకాశించును. జీవులు చేయు పాపపుణ్యములను తెలిసి యమునికి విన్నవము చేయునట్టి శ్రవణులను వారు పన్నిద్దఱు ఆపట్టణమునందు గలరు. జీవులంద ఱును ఆపన్నిద్దఱిని యారాధింపవలయును. ఆశ్రవణులను ఆరాధించిన జీవుండు అంత్యకాలమందు యమపురి చేరునప్పుడు వాండుచేసిన పాపములనన్నియు చెప్పక, పుణ్యములనే యాశ్రవణులు చెప్పుదురు. కాబట్టి శ్రవణుల నారాధించుట మిక్కిలి శ్రేయమని తెలియుము అని చెప్పెను.

ఆఱవ యధ్యాయము

సమాప్తము.

## ౭వ యధ్యాయము.

సూతపౌరాణికుండు శౌనకాదులను జూచి మహాఋషులారా! వినుండు. తర్వాత వేదస్వరూపుండగు గరుడుండు, పరమకారుణ్యమూర్తియగు భగవంతుని పాదకమలములకు నమస్కరించి, స్వామీ! ముందుచెప్పిన శ్రవణులు పన్నిద్దఱును ఎవరియొక్క పుత్రులు? యమపురమునందు వారుండుటకు కారణమేమి? మనుష్యులు చేయు పాపపుణ్యములను వారెట్లు యెఱుంగుదురు? వానిని నాకు జెప్పుమని వేండగా, భగవంతుండు మిగుల సంతసించి గరుడా! వినుము, మహాప్రళయము సంభవించిన కాలమందు అద్వితీయుండైన మహావిష్ణువు బ్రహ్మరుద్రాదులతో సర్వజగమును తనలో నైక్యముకాంగా మఱ్ఱిటియాందు శయనించి యుండెను. ఆవిష్ణువుయొక్క నాభియందు బ్రహ్మజనించి, యాహరిని గుఱించి బహుకాలము తపముచేసి, వేదములను, సృష్టియు నెఱింగి, తర్వాత రుద్రాది దేవతలను, సకల వస్తువులను పుట్టించెను. పుట్టించినతోడనే రుద్రాది దేవతలందఱును వారివారి కృత్యములనుచేయ నారంభించిరి. అందఱికంటె బలవంతుండగు యమధర్మరాజును, సంయమినియను నగరమును చేరి, యాసనాసీనుండై, జీవులుచేయు పాపపుణ్యములను తెలిసికొన నారంభించెను. వానికి జీవులు చేయు పాపపుణ్యములు తెలియకుండుటచే, మిక్కిలి ఖిన్నుండై చతుర్ముఖుండగు బ్రహ్మను నమస్కరించి, స్వామీ! నేను సంయమినినగరమును చెంది, జీవుల యొక్క పాపపుణ్యములను తెలిసి, వానికిందగినట్లు శిక్షించుటకును, రక్షించుటకును

యత్నించితిని. అయినను ఆజీవులుచేయు పాపపుణ్యములు నాకు సరిగా తెలియక యున్నవి. వానిని తెలిసికదా జీవులను రక్షయును, శిక్షయును చేయవలయును? కాఁబట్టి వానిని నేను తెలియునటుల కృపచేయవలయునని ప్రార్థింప నలుమొగముల వేలుపు వానినివిని దర్భను విసరివేసి, దానిమూలముగా, మిగుల దేహకాంతిగలవారును, విశాలమయిన నేత్రములుగలవారును, జ్ఞాననేత్రముచేత సకలమును తెలియఁదగినవారునైన పన్నిద్దఱు పుత్రులను సృష్టించి, యమునిజూచి ఓధర్మరాజా! జీవులందఱు తలంచుటయు, మాటలాడుటయు, చేయుటయును లేశమయినను తప్పక తోడనుండువారువలె వీరలు తెలిసి నీకు విశదపఱతురు. వారిచే నీవు తెలిసి శిక్షయును రక్షయును చేయుమనెను. యముఁడు బ్రహ్మను మిగుల స్తోత్రముచేసి యాశ్రవణులతోడ దక్షిణ దిక్కునకు తెచ్చి, జీవులయొక్క పాపపుణ్యముల నెఱింగితగిన రీతిగా చేయుట కారంభించెను. గరుడా! మరణము నొందినతోడనే, అంగుష్ఠమాత్రమైన వాయుస్వరూపముగల జీవుని యమకింకరులు యమలోకమునకు కొనిపోదురు. ధర్మముచేసిన యుత్తములందఱు ధర్మమార్గముగా నాలోకము చేరుదురు. పెద్దలను దానధర్మములు చేసినవారు విమానములయందేగుదురు. పెద్దలు కోరినవానిని వారికి యిచ్చినవారలు సుందరములగు గుఱ్ఱములమీఁదనెక్కి పోవుదురు. మోక్షాపేక్షులయి వేదశాస్త్రముల నెఱింగి భగవంతునియందు భక్తిచేసినవారలు హంసలను పూన్చినవిమానములయందు పోవుదురు. ఈనాలుగు విధములయందును సంబంధపడని పాపులు పాదచారులై పోవుదురు. ఆత్రోవయందుండు వృక్షముల యాకులన్నియు సూరు కత్తులతో సమానములయియుండును. ఇసుకయంతయును వేఁడి చల్లిన గులకరాళ్లవలె నుండును. ఆమార్గమునందు పోవునప్పుడు మిక్కిలి కష్టమగును. జీవుఁడు శ్రవణులను పూజించి యుండినట్లయిన నాశ్రవణులు జీవునియొక్క పాపములను జెప్పక, పుణ్యములను మాత్రము యమునికి జెప్పుదురు. శ్రవణులను పూజించు జీవుని కేకాలమందును పాపభయము లేదు. శ్రవణపూజ చేసినతోడనే, పండ్రెండు కలశముల నిండుగా నన్నమువండి యాకలశములను శ్రవణుల నుద్దేశించి బ్రాహ్మణులకు దానము చేయవలయును. అట్లు దానముచేసిన జీవునికి శ్రవణులు యమలోకమునందు సకల శ్రేయముల నొసఁగుదురు. గరుడా! శ్రవణులయొక్క యుత్పత్తి మొదలగు వానిని చెప్పునట్టి యీకథను భక్తితో విన్నవాఁడు పాపములయందుండి తొలఁగి పరిశుద్ధుఁడగునని చెప్పెను.

ఏఁడవ యధ్యాయము

సమాప్తము.

---

## ఎనిమిదవ యధ్యాయము.

సూతుండు, శౌనకాది మహాఋషులారా! ఆదిదేవుండైన భగవంతుండు గరుడుని జూచి వైనతేయుండా! జీవుండు చేయు పాపపుణ్యములను చిత్రగుప్తుండు శ్రవణులవలన నెఱింగి, యమునియొక్క యాజ్ఞప్రకారము తగినట్లు చేయును. జీవుండు వాక్కుచేఁజేసిన పాపపుణ్యములను వాక్కుచేతను, శరీరముచేత చేసినవానిని శరీరముచేతను, మనస్సులో చేసినవానిని మనస్సుచేతను అనుభవించును. పెద్దలను స్తోత్రము చేయుట, వేదశాస్త్రములు చదువుట మొదలయినవి చేసినవాఁడు ఎచ్చటను వాక్కుచేత జయమును పొందును. పెద్దలను దూషించుట, నీచభాష నుచ్చరించుట మొదలగు పాపముల చేసినవాని నోటియందు పురుగులు పడును. పుణ్య తీర్థములయందు స్నానము చేయుట, పెద్దలకు నమస్కరించుట మొదలగు సత్కార్యములు చేసిన వాఁడు మంచి విలక్షణమగు దేహమును బొందును. పాపస్త్రీ సంభోగము చేయుట, ఇతరుల ప్రాణముల నొప్పించుట మొదలగునవి చేసినవాఁడు వికారమైన దేహమును పొందును. ఆదిదేవునియొక్క నిత్య దివ్యమంగళ విగ్రహమును ధ్యానించుట, ఎవ్వరికిని మేలుతలంచుట మొదలగునవి చేసినవాఁడు ఎల్లప్పుడును సంతోషముతోఁ గూడిన మనస్సుగలవాఁడగును. ఎప్పుడును, ఎవ్వరికిని చెడు దలంచువాఁడు దుఃఖమనస్కుండగును. యమపురియొక్క రీతియు, ఆపట్టణమునకు పోవు మార్గమునందు గల సుఖదుఃఖములును నీకు చెప్పితిని. మరణము నొందినవాని గుఱించి యన్నదానము మొదలయినవి చేయవలయును. ఆదానఫలముచేత, మరణము నొందిపోవు జీవుఁడు మార్గమందు కష్టము నొందక పోవును. దీపదానము చేసినట్టులయిన జీవుఁడు అంధకారమయిన మార్గమునందు త్రోవ తెలిసి సుఖముగా పోవును. కార్తికమాస శుక్లపక్ష చతుర్దశియందు దీపదానము చేయుటచేతను, వృషోత్సర్జనము చేయుటచేతను జీవుఁడు మంచిలోకమును పొందును. పదకొండవదినము వేయు పిండముచేత శిరస్సు రోమములు మొదలగు వానితోఁ జక్కగానుండును. ఉదకకుంభదానము చేసినట్టులయిన యమదూతలు తృప్తినొంది జీవుని బాధింపక యుందురు. శయ్యాదానము చేసినట్టులయిన జీవుఁడు విమానము నెక్కి మంచిలోకము చేరును. గతించిన జీవుఁడు ఆఁకలిదప్పులతో బాధపడుచు, యింటికిముందు నిలుచును కాఁబట్టి, పదకొండవ దినమందైనను పన్నెండవ దినమందైనను వానిగుఱించి దానధర్మములు చేయవలయునని చెప్పెను.

గరుడుండు భక్తవత్సలునిఁజూచి నమస్కరించి స్వామీ! పదదానమనునది యెద్ది? దాని నెవ్విధముగా చేయవలయును? కటాక్షింపవలయుననఁగా, భగవం

రుడు గరుడా! ఛత్రమును, పాదుకలును, దండమును, వస్త్రమును, ఉంగరమును, ఉదకకుంభమును, ఆసనమును, అన్నమును, పూజాద్రవ్యములును, యజ్ఞోపవీతమును, తామ్రభాజనమును, బియ్యము, మొదలగువానిని సద్బ్రాహ్మణునకు కివ్వవలయును. ఛత్ర దానము చేయుటవలన జీవుడు యమపురికి బోవునపుడు మార్గమందు చల్లని నీడ యందు బోవును. పాదుకాదానముచేత గుఱ్ఱమునెక్కి పోవును. అట్లు చేయుదాన ములవలని ఫలమును మార్గమునందనుభవించి సుఖముగా పోవును. వానియందు కొన్ని దానములచేత యమదూతలు సంతోషించి, జీవుని బాధింపక యాదరముతో కొనిపోదురని చెప్పెను. ఓ నైమిశారణ్యవాసులారా! తర్వాత ఖగరాజు సర్వలోక శరణ్యునిజూచి ఓకరుణానిధీ! నరకము లెన్ని? వాని స్వరూప మెట్టిది? నాకు దయచేసి చెప్పవలయుననగా, పరంధాముఁడు గరుడా! పాపము చేసినవారు చెందు నట్టి క్రూరమయిన నరకములు ఎనుబదినాలుగులక్షలు గలవు. వానిలో తమిస్రంబును, అంధతామిస్రంబును, రౌరవంబును, మహారౌరవంబును, కుంభీపాకంబును, కాల సూత్రంబును, అసిపత్రవనంబును, సూకరముఖంబును, అంధకూపంబును, క్రిమిభోజనం బును, సందంశంబును, తప్తోర్మియు, వజ్రకంటకశాల్మలియు, వైతరణియు, పూయో దయు, ప్రాణరోధయు, విశసనంబును, లాలాభక్షణంబును, సారమేయాదనంబును, అవీచిరయంబును, రేతఃపానంబును, అను యిరువదియొక్క నరకములు మిక్కిలి క్రూర ములు. మృతినొందినవానిగుఱించి ప్రతిదినమునియ్యఁబడు నుదకకుంభదానమును దూ తలు గ్రహించి తృప్తిచెందుదురు. మాసికములు మొదలగునవి జీవుఁడుపొంది తృప్తుఁడగును. దూతలునువానిచే తృప్తిచెందుదురు. సంవత్సరాంతమునందు జీవుఁడు పిండముచేత గలిగిన శరీరముతో యమపురి చేఱునని చెప్పితిమే యాజీవుఁడు యమపురిజేఱుకుట ముందు ఆపిండశరీరమును విడచి యంగుష్ఠమాత్రమై యొక జమ్మిచెట్టునందు కొంతకా లము వసించి తర్వాత కర్మవశమయిన శరీరమునొంది యమునివద్దికి పోవునని చెప్పెను.

ఎనిమిదవ యధ్యాయము

సమాప్తము.

---

## తొమ్మిదవ యధ్యాయము.

---

సూతపౌరాణికుఁడు ఋషులారా! వాసుదేవుఁడు గరుడునిజూచి ఖగకులేంద్రా! అంగుష్ఠప్రమాణుఁడైన జీవుఁడు కర్మవశమయిన శరీరమునొంది శమీవృక్షమును విడచి

యమదూతలతోడ యిరువదియామడ విస్తీర్ణమయిన చిత్రగుప్తునియొక్క పట్టణము గుండావని, యమపురమును చేరును. ఆయమపట్టణము పుణ్యము చేసినవారి కన్నులకు మిక్కిలిసంతోషముగా ప్రకాశించును. ఇనుముచేత చేసినదండమును, లవణమును, ప్రత్తియు, నూవులతోపాత్రయును, అను వీనిని దానముచేయవలయును. ఈదానముల చేత యమదూతలధిక సంతోషమును పొంది జీవుడచ్చటికి పోయినమాత్రమున నాలస్యము చేయక ధర్మరాజునకు తెలియపరతురు. ధర్మధ్వజుడను పేరుగలవాడొక్కడు సర్వకాలమును యమునియొక్క నగరునందుండును. గోధుమలును, సెనగలును, అనుములును, తిలలును, ఉలవలును, పెసలును, కందులు అను నీయేడుధాన్యములు పాత్రలయందుంచి దానము చేసినట్టులయిన నాధర్మధ్వజుడు తృప్తుడై యీజీవుడు యోగ్యుడు, పుణ్యము చేసినవాడని యమునకు విన్నపముచేయును. పాపము చేసిన జీవునకు ధర్మరాజు మిక్కిలి భయంకరరూపముతో కనుపడును. ఆజీవుడును వానిజూచి భయముజెంది వణకి మొఱబెట్టును. పుణ్యము చేసిన జీవునకు మంచిరూపముతో కనుపడును. ఆజీవుడు భయపడక వానిజూచి సంతోషించును. ధర్మరాజొక్కడే పాపికి ఘోరరూపముగాను, పుణ్యునకు మంచిరూపముగాను కనుపడును. పుణ్యము చేసిన జీవుడు పోయినట్టులయిన, ఈజీవుడు మహాపుణ్యము చేసినవాడగుటచే సూర్యమండల మార్గముగా బ్రహ్మలోకమును చెందదగినవాడని యముడు తాను కొలువున్నస్థానమునుండి తోడనే లేచినిలచును. యమలోకమందు కింకరులందఱు పాశము, ముసలము, మొదలయినవి చేతియందు ధరించి నిలుతురు. గతించిన జీవునకు మాసికశాతకుంభములు మొదలయినవియు, పథదానమును చేయక పోయినట్టులయిన ఆజీవుడు కష్టమునొంది, కింకరులు పాశముతో కట్టి, రోకండ్లచేత కొట్టి, గొడ్లవలె నీడ్వగా కాలుని సమీపమందు జేరి, పూర్వజన్మమందు చేసిన పుణ్యపాపములకుతగిన యొకజన్మమును పొందును. అధిక పుణ్యము చేసినవాడగునేని దూతలచే బాధనొందక యముని ముందఱపోయి దేవత్వము పొందును. పాపియగునేని కష్టములనుచెంది వణకుచుపోయి నరకమునంబడి తర్వాత పురుగులు మొదలుగాగల జన్మముల నెత్తును. పాపపుణ్యములు సమముగానుండెనేని పూర్వపు మనుష్య జన్మమునే చెందును. దానధర్మములు చేసినవాడు యేకారణముచేత నేజన్మమెత్తినను, ఆదానధర్మముల ఫలమును ఆజన్మమునందనుభవించును. జీవుడు పోయినతోడనే శరీరమును భూమియందు పూడ్చినట్టులయిన నాశరీరము మంటితో కలియును, ఖండములుచేసి పారవేసినట్టులయిన నక్కలు మొదలగునవి తిని మలరూపమగును, దహనము చేసిన బూడిదయగును. శరీరతత్వమట్లుండియు, జీవునకు మనుష్య జన్మము దొరకుట దుర్లభము. మనుష్యజన్మమందును, బ్రాహ్మణకులమునందు బుట్టి, శీలుడై,

పొందదగిన మోక్ష సామ్రాజ్యమును పొందడేని, యనేక తపములచేత కష్టపడి సంపాదించిన యమృతకలశమును బుద్ధిలేమిచేత భూమియందు బాఱవిడచుటకు సామ్యమగునని చెప్పెను.

తొమ్మిదియవ యధ్యాయము
సమాప్తము.

---

## పదియవ యధ్యాయము.

---

సూతుఁడు శౌనకాది ఋషులారా! గరుడుఁడు భగవంతునిజూచి స్వామీ! ఏవిధపాపమును చేసినవాఁడు ప్రేతజన్మము నొందును? ఆప్రేతజన్మమునుండి యెట్లు తొలఁగును? ప్రేతజన్మములో లోకమునందు సంచరించునో? లేక యమునియొక్క కావలియందుండునో? చెప్పవలయునని ప్రార్థింపఁగా, భగవంతుఁడు, గరుడా! ఇతరులయొక్క ద్రవ్యమును, భార్యను నపహరించువాఁడెవఁడో వాఁడు శరీరములేక, వాయురూపమయిన ప్రేతజన్మము నొంది, యాకలిదప్పులచేత బాధనొంది, యమునియొక్క బంధమునుండి విడువఁబడి యెల్లప్పుడు సంచరించును. ఒకఁడు మృతినొంది, వానిశరీరము యింటియందుండఁగనే, వాఁడు వచ్చినదానిగ తలంచి లేశమయినను దుఃఖములేక దారాపుత్రాదులను వంచించి వానియొక్క ద్రవ్యము నపహరించువాఁడును, అపహరింపఁగోరువాఁడును వీరిరువురు ఘోరమయిన నరకములనన్నియు ననుభవింతురు. గతించినవాని ద్రవ్యమును వాని సంతతివారు పొందక మోసముచేసి యపహరించిన వానికంటె క్రూరుఁడును పాపి యెవ్వఁడును లేఁడు. ఈవిధమయిన పాపములను చేసినవాఁడే ప్రేతజన్మమునొంది తనయొక్క కుటుంబమువారిని, చుట్టములను బాధించును. పితృదినమందు వచ్చెడు పితలను ఇంటిలోపల విడువక ద్వారమందునిలిచి యడ్డగించి తఱుమును. పితృదేవతలకిచ్చునట్టి హవిస్సు మొదలగువానిని వాఁడే తినును, ఇంటియందుగల ద్రవ్యము మొదలగువానిని కుటుంబము వారను భవింపకయుండును, యితరుల కిచ్చునదియును వ్యర్థముగానుంచజేయును. తన పుత్రులు మొదలగువారికి సంతతిలేక వంశనాశనమగునట్లు చేయును. శీతజ్వరము, తాపజ్వరము, స్ఫోటకము మొదలగువానిని, వానిసంతతివారికి కలుగజేసి వారిని బాధించును. పుత్రుఁడు మొదలగు వారినోటినుండి యూరు ఉమినీటిని త్రాగునని చెప్పెను. గరు

 

డుఁడు స్వామీ! ప్రేతజన్మమునొందినవాఁడు యింకను ఏమి చేయును? కుటుంబమందొకఁడు ప్రేతజన్మము నొందియున్నాఁడని యెట్లు తెలియునగునని యడుగఁగా, మాధవుండు, గరుడా! ప్రేతజన్మము నొందినవాఁడు తనవంశమునే మిక్కిలి పీడించును. ధర్మము చేయువానికిని, హరినామసంకీర్తనము చేయువానికిని, పితృదేవతలనుద్దేశించి శ్రాద్ధాదులను చేయువానికిని, సేతువు మొదలగు తీర్థయాత్రలు చేయువానికిని ప్రేతజన్మము నొందినవానిచే బాధకలుగదు. సత్కార్యములను చేయనివానికిని, పెద్దలను దూషించువానికిని, దైవభక్తిలేనివానికిని, మాంసము దినువానికిని, కల్లుద్రాగువానికిని, అబద్ధమాడువానికిని ప్రేతజన్మమునొందినవానిచే బాధకలుగును. పాపములను చేయుటయు, మగబిడ్డలులేక నాడుబిడ్డలనేకనుటయు, మగబిడ్డలు పుట్టి పుట్టి చచ్చుటయు, బంధువుల పగగలుగుటయు, గోవులు మొదలగునవిలేక యుండుటయు, మిక్కిలి కష్టములు గలుగుటయు, మిత్రులయొక్క విరోధము సంభవించుటయు, ఉపవాస దినమగునేకాదశియందు అన్నము తినుటయు, హరిభక్తిచేయక వృథాకాలక్షేపము చేయుటయు, జపహోమములు చేయకుండుటయును, తనకంటె హీనజాతివారితో స్నేహము చేయుటయు, దేవ బ్రాహ్మణులను, తల్లిదండ్రులను దూషించుటయును, ఇతరుని జంప యత్నించుటయును, పైరులు చక్కగా వృద్ధినొందియు ఫలమునివ్వక నశించుటయు, తక్కువ జాతియందు పెండ్లాడుటయు, కన్యనిచ్చుటయు, హీనులుచేయు కర్మమును చేయుటయు, ఎప్పుడు నధర్మచింతగలిగి యుండుటయు, నిత్య దరిద్రతయు, అగ్నిచేతను, రాజుచేతను ద్రవ్యము నాశము నొందుటయు, మార్గమందు చోరులవలన బాధనొందుటయు, కడుపునొప్పి మొదలగు మహారోగములు సంభవించుటయు, శృతిస్మృతిపురాణేతిహాసములను అబద్ధములని చెప్పుటయు, తేజోహీనుఁడుగా నుండుటయు, పితృకర్మములు లోపించుటయు, పుత్రుఁడు పగవానివలె తండ్రిని ద్వేషించుటయు, భార్యతనతో కాపురము చేయకుండుటయు, భార్యతో పలుమారు కలహించుటయు, మొదలయినవి తన కులమునందు బుట్టి, గతించి ప్రేతజన్మమునొందిన వానిచేతనే కలుగుచున్నవి. ఏవంశమునందు ప్రేతజన్మదోషము కలిగియున్నదో ఆవంశమునకు దుఃఖమే మిక్కిలిగానుండును. ప్రేతజన్మము నొందినవాఁడు భయంకరమగు ముఖముతోడను, అంపమునంటి దంతములతోడను తనకులము వారిస్వప్నమునందువచ్చి, అయ్యో! నన్ను గాపాడువాఁడెవ్వఁడునులేడే, ఆకలిదప్పులు బాధించుచున్నవే, ప్రేతజన్మము వదలలేదే యని మొఱబెట్టును అని చెప్పెను.

పదియవ యధ్యాయము

సమాప్తము.

## పదకొండవ యధ్యాయము.

సూతమహర్షి నైమిశారణ్యవాసులారా! తర్వాత గరుడుఁడు ముకుందుని జూచి స్వామీ! ప్రేతజన్మము నొందినవాఁడు దానినుండి యెట్లు విముక్తుఁడగును? ఎంతకాలమెక్కని ప్రేతజన్మము పీడించును? దయజేసి చెప్పవలయుననఁగా, విష్ణుదేవుండు గరుత్మంతుడా! ప్రేతజన్మము నొందినవాఁడు తన వంశస్థునికి స్వప్నమందు తోఁచినను తోఁచును. తోఁచక కులమునందుండువారికి చెడుగులను మాత్రము చేసినను చేయును. స్వప్నమందుతోఁచినను, చెడుగులను చేసినను వానిని పెద్దలకు తెలియ పఱచి, వారు విధించిన ప్రకారము ధర్మచింతగలిగి, తియ్యమావిడి, నారికేళము, సంపకము, అశ్వర్థము మొదలయిన వృక్షముల నుంచుటయేగాక యనేకములగు పుష్పజాతి వృక్షములనుంచి పెంచవలయును. బ్రాహ్మణులకు భూదానము మొదలగు నవి చేయవలయును. పశువులమందలు కడుపార మేయుటకు పచ్చికగల బయళ్లను సాగుబడిచేయక విడువవలయును. నీటికై తటాకమును త్రవ్వింపవలయును. భగవద్భాగవత కైంకర్యములు చేయవలయును, గంగాది పుణ్యతీర్థములయందు స్నానముచేసి, దానధర్మములు చేయవలయును. ఎప్పుడు కష్టములు కలుగుచున్నవో అప్పుడు యివి యన్నియు చేయవలయును. చేయకున్న కష్టములు వృద్ధియగును. ప్రేతజన్మదోషము చేత నాధర్మములయందు బుద్ధి ప్రవేశింపక పోయినను, భక్తికలుగకపోయినను ఎవ్వఁడు ప్రయత్న పూర్వకముగా నాధర్మములను చేయునో వాఁడు సుఖము నొందును. ప్రేతజన్మము నొందినవాఁడును కష్టములను వదలి భూలోకమునుండి యమలోకమునకు బోయి యా ప్రేతత్వమును విడచును. తన కులము వృద్ధినొందుటకు పుత్రుని కలుగజేయును, అని చెప్పెను. గరుడుఁడు ఓజగధీశా! ఒకనికి కులమందు ప్రేత జన్మముగలవాఁ డొకఁడున్నాఁడని తెలియకున్నను, ఆప్రేతజన్మము నొందినవాఁడు స్వప్నమునందువచ్చి చెప్పకున్నను, కులమునకు కష్టములు మాత్రము కలిగినను, పెద్దల నడిగిన ప్రేతజన్మదోషముచేతనే కష్టములు కలుగుచున్నవియని చెప్పినను, అప్పుడు చేయఁదగినవి యెవ్వి? కటాక్షింపవలయుననఁగా, భక్తపరాధీనుఁడగు భగవంతుఁడు గరుడా! పెద్దలు చెప్పినవానిని సత్యమనియే నమ్మవలయును. ఒకఁడు స్నానము, జపము, హోమము, దానము మొదలగు వానిచేత తనయొక్క పాపనివర్తిచేసికొని, నారాయణబలి చేయవలయును. పాపనివర్తి చేసికొనక నారాయణబలి చేయుటకు యత్నించినవది నెఱవేఱక యుండునట్లు భూతప్రేత పిశాచములు విఘ్నముచేయును కాఁబట్టి పూర్వమందు పాపనివర్తిచేసికొని తర్వాత నారాయణబలిని చేయవలయును. పుణ్యకాలమందు, పుణ్యక్షేత్రములయందు ఎవఁడు పితృప్రీతిగా దానధర్మములు

చేయునో, వాఁడు భూతప్రేత పిశాచములవలన బాధలేశమయిన చెందఁడు. మనుష్యునకు తల్లి, తండ్రి, ఆచార్యుఁడు వీరలే ముఖ్యములగు దైవములగుదురు. శరీరమును కలుగజేయుటచేతను, సన్మార్గమును బోధించుటచేతను ఆమువ్వరే ముఖ్యులగుదురు. ఏకాలమునందును వారిని పూజింపవలయును. వారుచెప్పినరీతిగా నడువవలయును. తల్లిదండ్రులను పూజించువాఁడు దేవబ్రాహ్మణపూజయు, పుణ్యస్థలయాత్రయు, తీర్థయాత్ర మొదలయిన వానిని చేయకున్నను దోషములేనివాఁడగును. తల్లిదండ్రుల నుపచరింపకయును, వారుచెప్పిన రీతి నడువకయును అధర్మములన్నియు తప్పకచేసిన దానివలన వ్యర్థమగునేగాని లేశమయినను ఫలములేదు. తల్లిదండ్రులు మృతినొందిన వెనుక వారినిగురించి దానధర్మము లెవ్వఁడుచేయునో వాని ఫలమును వాఁడే పొందును. తల్లిదండ్రులను పున్నామ నరకమునుండి తరింపఁజేయువాఁడుగాన కుమారునకు పుత్రుఁడనుపేరుకలిగెను. ఎవ్వఁడు తల్లిదండ్రులమాటలనుమీరి భార్యాపుత్రుల మాటలను వినునో వాఁడు చండాలునికంటె నీచుఁడు. నూతియందుగాని, నదియందుగాని పడి చచ్చినవానికిని, కత్తిచేత నఱకఁబడి ప్రాణము విడిచినవానికిని, ఆత్మహత్యచేసికొనినవానికిని యొక సంవత్సరమునఱకు కర్మము చేయఁదగదు. కర్మము చేయునంతవఱకు వివాహమును, తీర్థయాత్రయును విశేషధర్మములును చేయుటకూడదు. సంవత్సరాంతమునందు కర్మము చేసినవెనుక నవియన్నియు చేయనగునని చెప్పెను.

పదకొండవ యధ్యాయము
సమాప్తము.

## పండ్రెండవ యధ్యాయము.

సూతపౌరాణికుండు ఋషులారా! తర్వాత గరుడుఁడు భగవంతునిజూచి ఓకల్యాణగుణనిలయా! జీవుఁడు ఏపాపముచేత ప్రేతజన్మము నొందును? ఆప్రేతజన్మము నొందినవాఁడు దేనిని భుజించును? ఎచ్చటవాసము చేయును? దయచేసి చెప్పవలయుననఁగా, పరమపదనాథుఁడు, వైనతేయుఁడా! పూర్వజన్మమునందు మహాపాపముచేసినవాఁడే ప్రేతజన్మము నొందును. నూతులును, నడబావులును, తటాకములును, పూదోటలును, చలిపందిళ్లును, సత్రములును, దేవాలయములును ప్రతిష్ఠచేసి, సర్వజనోపయోగమైన ధర్మము చేసినవానియొక్క వంశమందు బుట్టినవాఁడు తర్వాత నాధర్మములనన్నియు విక్రయించినట్టులయిన వాఁడు మృతినొందిన తర్వాత ప్రేతజన్మము నొందును. చేసినవాఁడే విక్రయించినట్టులయిన వాఁడును ప్రేత

జన్మమునొందును. పరులభూమిని యపహరించినవాఁడును, గ్రామము, పొలము, పూఁదోట, వనము, వీనియొక్క హద్దులనువంచించి తననేలలో చేర్చువాఁడును, తటాకముత్రవ్వి నేలలో చేర్చువాడును, చండాలునిచేత చంపఁబడినవాఁడును, నీటియందు పడి చచ్చినవాఁడును, సర్పమయినను, కుక్కయయినను కఱచి చచ్చినవాఁడును, పిడుగుపడిచచ్చినవాఁడును, నిప్పుచేత నశించినవాఁడును, గోవుపొడిచి గతించినవాఁడును, ఉరివేసికొని ప్రాణములు విడిచినవాఁడును, విషముచేత మృతినొందినవాఁడును, ఆయుధముచేత హతుఁడైనవాఁడును, కర్మముచేయుటకు తనకులమందెవ్వరునులేక చచ్చినవాఁడును, దేశాంతరమునందు ఎవ్వరికిని తెలియక మరణమునొందినవాఁడును, కుష్టము మొదలయిన మహారోగములచేత గతించినవాఁడును, దొంగచేఁ జచ్చిన వాఁడును, వృషోత్సర్జనము చేయక మృతినొందినవాడును, తల్లిదండ్రుల శ్రాద్ధములుచేయక జచ్చిన వాఁడును, ప్రేతజన్మమునొందును. ఓగరుడా! బ్రాహ్మణుఁడు మృతినొందినట్టులయిన వానికై కర్మము మొదలయినవి బ్రాహ్మణుఁడే చేయవలయును. శూద్రుఁడుగతించిన వానికై శూద్రుఁడే చేయవలయును. అదియునుంగాక మరణమునొందిన బ్రాహ్మణుని యొక్క సంస్కారముకొఱకు అగ్ని, పిడకలు, ఎండుకసవు, బియ్యము మొదలయినవి స్మశానమునకు శూద్రుఁడు కొనిపోయినట్టులయిన, మరణమునొందిన యాబ్రాహ్మణుఁడును, తీసికొనిపోయిన యాశూద్రుఁడును ప్రేతజన్మమునొందుదురు. గతించిన శూద్రుని సంస్కారమునకై పైజెప్పినవానిని బ్రాహ్మణుడుకొనిపోయినయెడల గతించిన శూద్రుఁడును, కొనిపోయిన బ్రాహ్మణుఁడును ప్రేతత్వమునొందుదురు. పర్వతముపై నుండి పడిచచ్చినవాఁడును, గోడక్రిందపడి నీల్గినవాఁడును, మంచముపై నిద్రించినరీతిగా చచ్చినవాఁడును, ఇంటిమేడయందు ప్రాణమువిడచినవాఁడును, భగవన్నామము నుచ్చరింపక మృతినొందినవాఁడును, రజస్వల, చండాలుఁడు మొదలగువారినితాకి, స్నానము చేయక సూతకమునందు జచ్చినవాఁడును, రజస్వలగానుండునప్పుడు మృతినొందిన యాడుదియుం ప్రేతజన్మము నొందుదురు. తల్లి, భార్య, కూతురు, అల్లుఁడు మొదలగు వారియొక్క శరీరదోషములను కన్నులారజూడక నితరుల మాటలనువిని వారిని జాతి భ్రష్టులనుగా జేయువాఁడును, మనుస్మృతికి విరోధముగా తీర్పుచేయువాఁడును, మిత్రద్రోహియు, బ్రాహ్మణులను, గోవులను హత్యచేయువాఁడును, సురాపాయియు, గురుభార్యను గూడువాఁడును, తెల్లనిపట్టు, స్వర్ణము వీనిని దొంగలించువాఁడును ప్రేతజన్మము నొందుదురు. ప్రేతజన్మము నొందినవారందఱును వృక్షజలములులేని యిసుక యెడారులయందు సంచరించి దుఃఖింతురు అని చెప్పెను.

పండ్రెండవ యధ్యాయము
సమాప్తము.

## పదమూడవ యధ్యాయము.

సూతపౌరాణికుండు ఋషులను జూచి, అనంతరము గరుడుఁడు, భగవంతుని నమస్కరించి స్వామీ! బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులుగాక మ్లేచ్ఛులనెడు వేఱొక జాతివారును గలరే, వారును, మఱియు బాలుఁడైనను, వృద్ధుఁడైనను, ధనవంతుఁడైనను, దరిద్రుఁడైనను, కరుణగలవాఁడైనను, లేనివాఁడైనను, విద్వాంసుఁడైనను, మూఢుఁడైనను, జ్ఞానియైనను, అజ్ఞానియయినను, ధర్మవంతుఁడైనను, అధర్ముఁడైనను, బలవంతుఁడైనను, దుర్బలుఁడైనను, ఉత్తముఁడైనను, నీచుఁడైనను, బ్రాహ్మణుఁడైనను మఱియు నెవ్వఁడైనను అకాలమునందు మృతినొందుటకు కారణమేమి? అని యడుగఁగా, భగవంతుఁడు వైనతేయుఁడా! ఒకడు మరణమునొందు కాలమునందు జీవమును గ్రహించుటకు యముఁడు నియమింపఁబడియున్నాఁడు. జీవులయొక్క పలువిధములయినదోషముల చేత నాజీవులు ఆయుక్షీణమయి గతించుచున్నారు. చచ్చిన యింటియందు భోజనము చేయువాఁడును, పరభార్యను గూడువాఁడును, తనకు దగని హీనవృత్తులు చేయువాఁడును అల్పాయువులగుదురు. ఇహపరసాధకమయిన సత్కార్యముల చేయనివాఁడును, పెద్దలను పూజించనివాఁడును, పరిశుద్ధుఁడు కానివాఁడును, దైవభక్తిలేనివాఁడును, పాపములనే చేయువాఁడును యమలోకమునందెప్పుడును నరకవాసము చేయుదురు. పరుల చేటుకోరువాఁడును, అసత్యమాడువాఁడును, భూతదయలేనివాఁడును, శాస్త్రవిరుద్ధముగానడచువాఁడును, తనకు దగిన కర్మమును విడచి పరులకు దగిన కర్మముల చేయువాఁడును, యమలోకమునందు యాతనల ననుభవింతురు. పుణ్యతీర్థములయందు స్నానము చేయకయు, జపహోమములు చేయకయు, దేవతలను, పెద్దలను ఆరాధింపకయు, శాస్త్రములను చదువకయు, కడచునట్టి దినములు వ్యర్థములగును. శూద్రజాతియందు పుట్టినవాఁడు బ్రాహ్మణులే దైవములని తలఁచి, భక్తితో వారు చెప్పిన కార్యములనుచేసి, దాసుఁడై వర్తించిన సద్గతినొందును. వాఁడు వేఱొకకర్మము చేయ నక్కఱలేదు. ఉత్కృష్టజాతులకుదగిన కర్మమును ఆశూద్రుఁడు చేయునేని నరకమునే పొందును. శరీరమో నిశ్చయములేనిది. నిరాధారమయినది. శుక్లశోణితములచేత కలిగినది. అన్నపానములచేత వృద్ధినొందినది. ఉదయమున భుజించిన యన్నము సాయంకాలమున నశించును. తోడనే ఆకలియగును. మఱల భుజింపకుండిన దేహము చెడును. కాఁబట్టి శరీరము నిత్యమనియు, కర్మముచేత వచ్చునదియనియు తలఁచి, జన్మరాహిత్యమునకై సత్కర్మములు చేయవలయును. కర్మముచేతగలిగిన శరీరమును ఎవ్వరిదయనదగును? దానిని స్వర్గముగా భరించి కృశించునట్టి జీవునిదియనవచ్చునా?

అన్నవస్త్రములిచ్చి రక్షించు యజమానునిదియనవచ్చునా ? గర్భోత్పత్తికి కారణమగు తండ్రిదియన సాధ్యమా ? పదిమాసములు మోసిన తల్లిదియనదగునా ? అట్టి తల్లిని కన్న మాతామహునిదియన నొప్పునా ? పితామహునిదియనవచ్చునా ? భస్మముచేయునటు వంటి యగ్నిదేవునిదియన నొప్పునా ? పెఱుకుకొని తినునట్టి నక్కయొక్క శరీరమనం దగునా ? జీవుండు పోయిన పిమ్మట పురుగులుగాను, మలముగాను, బూడిదగాను నశించు శరీరము ఎవ్వరికిని స్వంతముగాదని దృఢముగా నెఱింగి, శరీరమునందాశ యుంచక భగవద్భాగవతాచార్య కైంకర్యములుచేయవలయును. పాపములు మనో వాక్కాయములచే చేయఁబడుచున్నవి. అధికపాపము చేసినవాఁడు కుక్కనక్క మొదలగు నీచజన్మముల నొందును. మితపాపియగువాఁడు పూర్వజన్మమునే పొం దును. జీవుఁడు గర్భవాసము చేయుకాలమందు తల్లియొక్క మలమూత్రములచేత మిక్కిలి బాధనొందును. మరణబాధకంటె నధికమగు జననబాధను తలచి సన్మార్గము నందు ప్రవర్తింపవలయును. తల్లి గర్భమునందు పుట్టి బాల్యమందు క్రీడలచేతను, యవ్వనమందు మదనావస్థచేతను, ముదిమియందు తాపత్రయములచేతను, బాధచెం దుచు తనయొక్క సద్గతికి సాధకములయినవానిని వెదకుటలేదు. ఇట్టివారే లోకము నందనేకులు గలరు. పూర్వజన్మ పుణ్యముచేత జీవునకు ఆధారములగు వానిని తెలిసి కొనువాఁడెవ్వఁడో వాఁడే మోక్షము నొందును. కర్మముచేతనే జీవుఁడు పుట్టిపుట్టి చచ్చును. పుట్టి అధికకాలము జీవింపక ఐదేండ్లలో గతించుట పాపముచేతనని తెలి యుము. అధికపాపము చేసినవాఁడే పలుమారు పుట్టిపుట్టి చచ్చును. వానియొక్క పుట్టు చావులకు లెక్కలేదు. పూర్వజన్మమందు సన్మార్గప్రవర్తకుఁడై దానధర్మములు చేసిన జీవుఁడు ఇహజన్మమందు చిరకాలము భార్యాపుత్రాదులతో సుఖించి అంత మందు సద్గతి నొందును.

ఓగరుడా ! గర్భము ధరించిన యాఱుమాసములలో నేమాసమునందయినను గర్భపతనమాయెనేని మొదటి మాసమయిన నొక్కదినమును, రెండవమాసమయిన రెండుదినములును, మూడవమాసమయిన మూడుదినములును, నాలుగవమాసమందైన నాలుగు దినములును, ఐదయిననైదుదినములును, ఆరైననాఱుదినములు గర్భవతికి మాత్రము సూతకము గలదు. తండ్రికి సూతకములేదు. వాఁడు చేయవలసిన కర్మ మును యేమియులేదు. గర్భము చెడక పుట్టి, మూడు సంవత్సరములలో గతించినట్ట యిన, గతించిన యాశిశువు నుద్దేశించి క్షీరాన్నమును, పెరుగన్నమును, బాలుర కివ్వ వలయును. మూడు సంవత్సరములకు తర్వాత నైదుసంవత్సరములలోపల గతించినట్టయిన పైజెప్పినరీతినే బాలురకు అన్నము పెట్టవలయును. ఇట్లుగాక పుట్టిన మాసమునందే గతించినట్టులయిన, ఆయాజాతులకుజెప్పినరీతిని చేసి, జలమును, క్షీరమును, పాయసాదు

లను బాలురకు నివ్వవలయును. లోకమునందు పుట్టినవాఁడు చచ్చుటయ్యును, చచ్చిన వాఁడు పుట్టుటయును, నిశ్చయమగుటచేత, చచ్చిన తర్వాత పునరావృత్తిరహితమగు మోక్షసామ్రాజ్యము నొందుటకు యత్నించవలయును. అట్లుచేయకయును, దానధర్మములు చేయకయును, జీవితకాలమును వ్యర్థముచేసి చచ్చిన జీవుఁడు బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులలో నేకులమునందు బుట్టినను, దరిద్రముచేత నన్నవస్త్రమునకు మిక్కిలి కష్టపడి, త్వరగాచచ్చి, మఱియు పుట్టును. ఒకఁడు రాబోవు జన్మమునందు ఉత్కృష్ట జాతియందు బుట్టవలయుననియు, త్రిలోకాధిపత్యమును వహింపవలయుననియు, సకల శాస్త్రసంపన్నుఁడుగావలయుననియు, తలఁచి వానికిదగిన కర్మములను జేయుటకంటె, జన్మమే కలుగకుండుటకు దగినవానిని చేయుట మిక్కిలి యుత్తమము. తీర్థయాత్ర చేయువాఁడు పరిశుద్ధమనస్కుఁడగును. అసత్యమాడక వినయముతో మధురమగు మాటలాడువాఁడు సకల శాస్త్రసంపన్నుఁడగును. ధనవంతుఁడయ్యును దానధర్మము చేయని వాఁడు భావిజన్మమునందు దరిద్రుఁడై పుట్టును. ఆదరిద్రముచేత మహాపాపమును చేయును. ఆపాపముచేత మఱుజన్మమునందు నరకము నొందును. అనంతరము సాటిలేని దారిద్రముగలవాఁడై మఱల పుట్టును. కాఁబట్టి యొక్కఁడు తనకు గలిగిన ద్రవ్యమునకుదగినట్టు దానధర్మములు చేయవలయును. అని చెప్పి మఱియు చెప్పుచున్నాఁడు.

పదమూడవ యధ్యాయము
సమాప్తము.

---

## పదునాలుగవ యధ్యాయము.

---

సూతమహాముని ఋషిశ్రేష్ఠులారా! అనంతరము శ్రియఃపతియగు భగవంతుఁడు గరుడుని జూచి ఓగరుడా! ముందుచెప్పినవాని గుఱించియే, మఱియు జెప్పుచున్నాను. పూర్వజన్మము చేసిన పాపముచేతనే జీవుఁడు చచ్చుచున్నాఁడు. గర్భమునందే గతించినట్టులయిన ఏక్రియయును చేయవలసినదిలేదు. ఐదేండ్లకులోబడి మృతినొందినట్టులయిన శాస్త్రప్రకారముచేసి, బాలురకు క్షీరము, పాయసము, భోజనము మొదలగువాని నివ్వవలయును. పదకొండవదినమును, పండ్రెండవదినమును శాస్త్రమునందు చెప్పఁబడిన కొన్ని కర్మములు చేయవచ్చును. వృషోత్సర్జనమును, విశేషదానములును చేయవలసినదిలేదు. గతించినవాఁడు బాలుఁడైనను, యౌవనవంతుఁడైనను, వృద్ధుఁడైనను ఉదకకుంభదానము తప్పక చేయవలయును. మూడేండ్లకు పూర్వము

మృతినొందు బిడ్డలను భూమియందు పూడువవలయును. ఇరువదినాలుగు మాసములు నిండి యిరువదియయిదవమాసము పుట్టిన తర్వాత గతించు బిడ్డలను దహనము చేయవలయును. పుట్టిన యాఱుమాసములవఱకు శిశువనియు, మూడు సంవత్సరములవఱకు బాలుఁడనియు, ఆఱేండ్లవఱకు కుమారుఁడనియు, చెప్పవలయునని శాస్త్రము చెప్పుచున్నది. ఓగరుడా! పుట్టిన పదియాఱుమాసములవఱకు శిశువనియు, ఇరువదియేడు మాసములవఱకు బాలుఁడనియు, ఐదేండ్లవఱకు కుమారుఁడనియు, తొమ్మిదేండ్లవఱకు పౌండకుఁడనియు, పదియాఱు సంవత్సరములవఱకు కైశోరుఁడనియు చెప్పుదురు. శూద్రజాతియందే కులమువారైనను యజ్ఞోపవీతమును ధరించుటకూడదు. బ్రహ్మ క్షత్రియ వైశ్యులు మాత్రమే యజ్ఞోపవీతమును ధరింపవలయును. ఐదేండ్లు నిండి ఉపవీతుఁడైగాని, లేకగాని మృతినొందినట్టులయిన వానిగుఱించి విశేష మంత్రములు చెప్పక, పది దినములు పిండము మాత్రము వేయవలయును. అట్లు గతించినవానికి లోకవ్యవహారమును, తల్లిదండ్రుల స్నేహమును, విషయేచ్ఛ మొదలగునవి కొంచమగుటచేత, కర్మము కొంచమయినది. ఐదేండ్లకుపైన పండ్రెండేండ్లకు లోపలగాని యాపండ్రెండేండ్లు నిండిగాని, మృతినొందినట్టులయిన వృషోత్సర్జనము మొదలయినవి చేయవలయును. సపిండీకరణము మాత్రము చేయఁదగదు. పాలు, బెల్లము మొదలగువానిని జేర్చి పిండమువేయవలయును. ఘటము, ఛత్రము, దీపము దానము చేయవలయును. చేయకుండిన మృతినొందినవాఁడు అడవియందు బ్రమ్మానైపుట్టును. ఆబ్రమాను బియ్యము దంచు రోకలికే యుపయోగమగును. యజ్ఞోపవీతమును అపసవ్యముగాధరించి, తిల దర్భలతోనే కోద్దిష్టము మొదలగు శ్రాద్ధములు చేసినట్టులయిన, గతించినవాఁడు మఱు జన్మమునందు సత్కులమందు పుట్టి, దీర్ఘాయువైయుండును. మంచి పుత్రునిగనును. తనకు తన యాత్మ యేపుత్రుఁడయి జనించుట నిశ్చయమగుటచేత, పుత్రుఁడు చచ్చినట్టులయిన తండ్రియు, తండ్రికి పుత్రుఁడును కర్మము చేయవలయును. తానే తనకు పుత్రుఁడగునని వేదమే చెప్పుచున్నది. ఒక్కఁడైన సూర్యుఁడును, చంద్రుఁడును, జలము నిండియున్న యనేక ఘటములయందు వేఱువేఱుగా కానఁబడునట్లు, ఒక్కఁడే తనకు అనేక పుత్రులుగా జన్మించుచున్నాఁడు. కాఁబట్టి తిఱుచుగా నొకనియొక్క పుత్రుఁడు వానిరూపమును, బుద్ధియు, ఆచారమునుగలవాఁడగును. అయినను అంధునికియంధుఁడును, మూకునకు మూగయు, చెవిటివానికి చెవిటివాఁడును పుట్టుటలేదు. తండ్రికి గలిగిన గుణములలోనేదైన నొక్కటి కుమారునికి గలిగియుండును. అని చెప్పెను.

తర్వాత గరుడుఁడు పరమపదనాథుని జూచి జగదీశా! లోకమునందు తన భార్యకడుపునఁబుట్టిన పుత్రుఁడనియు నితరులయందు పుట్టిన పుత్రుఁడనియు పుత్రులు

పదివిధములుగలరని శాస్త్రము చెప్పుచుండుటచే ఒకఁడు తన దాసియందు పుత్రుని
గనినట్టులయిన నాపుత్రుఁడు వానికి కర్మము చేయనగునా? ఆపుత్రుఁడు కర్మము చేసి
నట్టులయినవానికి సద్గతి కలుగునా? ఒక్కనికి కూతురుమాత్రముండి, పుత్రుఁడును
ఆకూతురి కొడుకైన దౌహిత్రుఁడునులేక మృతినొందిన కర్మమెవ్వరుచేయవలయును?
అనియడుగఁగా, భక్తవత్సలుండు ఓవైనతేయా! ఎవ్వఁడు తన భార్యయొక్క గర్భము
నందు తనకేపుట్టిన పుత్రునియొక్క ముఖమును కన్నులారచూచునో వాఁడు ఆజన్మ
మందు పున్నామనరకమును చూడఁడు. వివాహమయిన దంపతులకు పుత్రుఁడు కలి
గిన వానికులముయొక్క పితృదేవతలు మిక్కిలి సంతోషింతురు. ఇతరమయిన నవ
విధ పుత్రులును ఇహలోక సాధకమునకేగాని పరలోకసాధకమునకు లేశమయినను
తోడ్పడరు. కనకు తన భార్యయందు జనించిన పుత్రుఁడే మరణకాలమందు చేయవల
సిన వానిని చేయుటకు పాత్రుఁడగును. ఇతరవిధమయిన పుత్రులుండుటచేత గతించిన
తండ్రినిగుఱించి చేయవలసినవానికి పాత్రులు కానేరరు. ఒకఁడు తనకు పౌత్రుఁడు
పుట్టువఱకుండి చూచినట్టులయిన వాఁడు సద్గతినొందును. ప్రపౌత్రునిజూచి గతిం
చిన వాఁడు దానికంటె శ్రేష్ఠమయినలోకమును పొందును. కూతురిని గన్నవాఁడు
కన్యాక్రయమునకాశింపక ఆకన్యను తులసీదళసహితముగా నొకనికి కన్యాదానము
చేయఁగా, నాకూతురు వానితో గాపురముచేసి పుత్రునిగనినట్టులయిన, నాపుత్రుఁడు
తన కులమునందిరువదియొక్కతరము వారిని తరింపజేయును. అట్లు పుట్టిన పుత్రుఁడే
తల్లిదండ్రులకు కర్మము సేయఁదగినవాఁడగును. ఒకఁడు మృతినొందిన, వానియొక్క
వేశ్యకు బుట్టినవాఁడు కొన్ని కర్మములు మాత్రము చేయవచ్చును. అన్నియు చేసెనేని
చేసినవాఁడును, గతించినవాఁడును నరకము నొందుదురు. అయితే వేశ్యాపుత్రుఁడు
తన్ను గన్నవానిగుఱించి మాత్రము ప్రతి సంవత్సరము శ్రాద్ధముచేయనచ్చును. అంతయే
గాక వాని తరమందుగలవారినిగుఱించి యేదియును జేయుటకూడదు. వేశ్యాపుత్రుఁ
డైనను, వానిని గన్నవాఁడు మృతినొందెనేని వాని గుఱించి దానములన్నియు చేయ
వచ్చును. బ్రాహ్మణులకు భోజనము మొదలయినవి చేయించుటకూడదు. భోజనా
ర్థము బియ్యము మొదలగువాని నివ్వనగును. కొందఱు వేశ్యకు బుట్టిన పుత్రుని తన
భార్యకు బుట్టినవానిగా భావించికొనియాడుదురు. సత్పుత్రుఁడు తీర్థయాత్రచేసినట్టు
లయిన అన్నరూపముగాను, ఆమరూపముగాను, హిరణ్యరూపముగాను, శ్రాద్ధము
చేయనగును. వేశ్యాపుత్రుఁడు తీర్థయాత్రచేసెనేని అన్నరూపమువినా ఆమ, హిరణ్య
ములతో శ్రాద్ధము చేయనగును. శూద్రజాతియందు పుట్టినవాఁడు, అన్నరూపముగా
శ్రాద్ధము చేసినట్టులయిన, చేసినవాఁడును, భుజించిన బ్రాహ్మణుఁడును, పితృదేవత
లును నరకము నొందునట్లు వేశ్యాపుత్రుఁడు అన్న శ్రాద్ధముచేసెనేని, వాఁడును,

భుజించిన బ్రాహ్మణుఁడును, పితృదేవతలును తీఱని నరకము ననుభవింతురు. బ్రాహ్మణజాతి స్త్రీకిని, బ్రాహ్మణజాతికి తక్కువజాతి పురుషునకు, పుట్టిన పుత్రుఁడును, బ్రాహ్మణస్త్రీకిని, సన్యాసికిని, పుట్టిన పుత్రుఁడును బ్రాహ్మణస్త్రీకిని, శూద్రునకును పుట్టిన పుత్రుఁడును, సగోత్రమునందు వివాహము చేసికొనినవానికి పుట్టిన పుత్రుఁడును చండాలురగుదురు. ఒకఁడు తన జాతియందే యొక కన్యను వివాహమయి, కన్న పుత్రుఁడే శ్రేష్ఠుఁడగును. కాఁబట్టి ఎవ్వరును సత్పుత్రునియే కనవలయును అని చెప్పెను.

పదునాలుగవ యధ్యాయము
సమాప్తము.

## పదియేనవ యధ్యాయము.

సూతపౌరాణికుండు నైమిశారణ్యవాసులారా! గరుడుండచ్యుతునిజూచి సర్వేశా! గతించినవాని గురించి యెప్పుడు సపిండీకరణము చేయవలయును? సపిండీకరణము చేయుటచే మృతినొందినవాఁ డేగతి చెందును? అదిచేయకున్న నే గతి చెందఁడు? మృతినొందినవానికిని, మృతినొందినదానికిని, పిండము ఒకటిగా చేయుటయెట్లు? ఒకటిగా చేసిన నేగతిపొందుదురు? భర్తసజీవుఁడైయుండి, భార్య మృతినొందినట్టు లయిన దానికి సపిండీకరణము చేయుటయెట్లు? దీనినంతయునాకు సవిస్తరముగా జెప్పవలయునని ప్రార్థింపఁగా, ఆదిమధ్యాంత రహితుఁడగు భగవంతుఁడు. ఓ వినతాపుత్రా! మృతినొందివానికి సంవత్సరాంతమునందు శాస్త్రీయముగా సన్నియుచేసి, సపిండీ కరణమునుచేసి, వానికులమునందు వీనికి ముందుగతించినవారి పింపముతో వీనిపిండమును చేర్చవలయును. అట్లుచేయుటచేత మృతినొందినవాఁడు ప్రేతత్వము విడచి, పితృదేవతలను చేరును. మృతినొందిన పండ్రెండవదినమందును, మూడవపక్షమందును, ఆఱవమాసమునందును సపిండీకరణము చేయవచ్చును. తండ్రిగతించినట్టయిన పుత్రుఁడు వానికికర్మమంతయుచేసి, సపిండీ కరణమునుచేయక నిలిపియుండినప్పుడు కర్మముచేసినపుత్రునకు వివాహము కూడెనేని తోడనే సపిండీకరణముచేసి తర్వాత వివాహము చేయవలయును. సపిండీకరణము చేయునంతవఱకు జీవుఁడు ప్రేతత్వముతో నుండుటచేత కర్మము చేసినవానికి కొంచము సూతకము కలిగియుండును. కాఁబట్టి వాఁడు శుభకార్యములను, సన్యాసులకు భిక్షయును చేయుటకూడదు. పిండము చేర్చినవెనుక మృతినొందనవాఁడు ప్రేతత్వము నదలి, పితృత్వముచెంది సంతోషిం

చును. దేహమనిత్యమగుటచేతను, గృహకృత్యములు పలువిధములగుటచేతను, పం
డ్రెండవదినమునందే సపిండీకరణము చేయుట యుత్తమమగును. ఔపాసనము
చేయుటకు విఘ్నము కలిగినను, పండ్రెండవదినమందు సపిండీకరణము చేయవచ్చును.
సపిండీకరణము చేసిన పిమ్మట తల్లిదండ్రుల వంశమునందు మూడు తరములవారికి
శ్రాద్ధము చేయవలయును. ఒకనికి మాత్రము శ్రాద్ధము చేయతగదు. షోడశము, సపిండీ
కరణము మొదలయినవి చేయుటచే మృతినొందినవాడు ప్రేతత్వమును విడచి, పితృ
దేవతలతోఁ జేఱి సుఖము నొందును. కూతురిని గన్నవాఁడు కొంతయయినను ద్రవ్య
మును గ్రహింపక దానిని కన్యాదానము చేసి యుండినట్టులయిన, అది మృతినొందిన
దాని పురుషుని గోత్రమును చెప్పి సమస్తక్రియలు చేయవలయును. మాంసవిక్రయము
చేయునట్లు తండ్రి క్రయము తీసికొని కన్యనిచ్చియుండి, అది మృతినొందిన దాని
యొక్క తండ్రిగోత్రమును చెప్పి క్రియలు చేయవలయును. తండ్రికి పుత్రుఁడే కర్మము
చేయవలయును. పుత్రుఁడులేనియెడల గతించినవానియొక్క కనిష్ఠుఁడైనను, జ్యేష్ఠుఁ
డైనను, వారిలో నొక్కని పుత్త్రుఁడైనను కర్మము చేయవలయును. గతించినవాని
యొక్క సహోదరులు విభక్త కుటుంబముగానున్న పక్షమందు వానియొక్క భార్య
కర్మము చేయవలయును. గతించినవానికి పుత్రుఁడును, సహోదరుఁడును, వాని
పుత్రుఁడును, భార్యయు లేనిపక్షమందు వాని దాయాదులు కర్మము చేయవలయును.
దాయాదులును లేనియెడల, శిష్యుఁడుండిన వాఁడు చేయవలయును. పైజెప్పినవారి
యందెవ్వరును లేనిపక్షమున పురోహితుఁడే కర్మము చేయవచ్చును. నలుగురైదుగురు
సహోదరులుండి వారియందొక్కనికి మాత్రము పుత్రుఁడుండిన వారందఱును పుత్రు
లున్నవారేయగుదురు. ఆప్రకారమే ఒక్కనికి నలుగురైదుగురు భార్యలుండి, యం
దొక్కతెకుమాత్రము పుత్రుఁడుండినట్టులయిన తక్కిన భార్యలును పుత్రవతులేయగు
దురు. పుత్రున కుపనయనముగాక ముందు తల్లిదండ్రులు గతించినట్టులయిన, యా
పుత్రుఁడే కర్మము చేయవలయును. పుత్రుని గనక మృతినొందినదానికి దానియొక్క
పెనిమిటి కర్మము చేయవలయును. సపిండీకరణము చేసినవెనుక తెలివిలేమిచేతనయి
నను, పితృదేవతలందఱికినిగాక మృతినొందినవాని గుఱించి మాత్రము శ్రాద్ధము చేసి
నట్టయితే, మృతినొందినవాఁడును, శ్రాద్ధము చేయువాఁడును, చేయించు పురో
హితుఁడును నరకము ననుభవింతురు. గతించినవానికి పుత్రులనేకులుండినను సంవత్స
రమువఱకు, క్రియలన్నియు నొక్కఁడే చేయవలయును. సంవత్సర పూర్తియగునంత
వఱకు నిత్యశ్రాద్ధములో పెద్దఘటమునందు నిండుగా జలముపోసి యుదకకుంభదాన
మును చేయవలయును, కర్మములు తప్పక చేసినట్టులయిన, మృతినొందినవాఁడు విమా
నముపైని పుణ్యలోకము భోగ్యును. పితామహుఁడు సజీవుఁడుగానుండునపుడు తండ్రి

మృతినొందినట్టులయిన వానికి సపిండీకరణము చేయుటకూడదు. పితామహుఁడు మృతి నొందినతర్వాత నాపితామహునికి సపిండీకరణముచేసి, పిమ్మట ముందు గతించిన తండ్రికి సపిండీకరణము చేయవలయును, తండ్రియు పితామహియు సజీవులయి యుండునపుడు తల్లి గతించినట్టులయిన, దానికి సపిండీకరణము చేయుటకూడదు. ఆయిరువురును మృతినొందిన తర్వాత వారికి సపిండీకరణముచేసి పిమ్మట తల్లికి చేయ వలయును. ఈవిధియే స్థిరముగాదు. ఇదియొకరిపక్షము. ఏయాఁడుది తన భర్తను దైవమని తలంచి, భక్తిచేసి, వాఁడు గతించినవెనుక వాని శరీరముతో సహగమ నము చేయుచున్నదో, ఆయాఁడుది యందఱికంటె మేలైన లోకమును చెందును. అది మహాపాపము చేసినదియయినను, భర్తతో ప్రాణము విడుచుటచేత మిక్కిలి పుణ్యవతియయి, పురుషుఁడు పాపిగానుండినను వానిని పుణ్యునిచేసి స్వర్గలోకము నందు వానితో బహుకాలము సుఖముగా వాసముచేయును. అట్లుండిన తల్లిదండ్రు లకు పుత్రుఁడు ఒక్కటిగా సపిండీకరణము చేయవలయును. వృషోత్సర్జనమును. దాన ములును, వేఱువేఱుగా చేయవలయును. ఆయిరువురికిని వేఱువేఱుగా బ్రాహ్మణు లనువరించి శ్రాద్ధము చేయవలయును. పాకము మాత్రమొక్కటిగా చేయవచ్చును. పిండము వేఱువేఱుగా వేయవలయును. ఒక్క సంవత్సర పర్యంతమన్నియు వేఱు వేఱుగా చేసినట్టులయిన నాయిరువురును తృప్తినొందుదురు. పుణ్యక్షేత్రములయం దును, గ్రహణము, మహాలయము మొదలగు పుణ్యకాలములయందును, ఆయిరువురికిని శ్రాద్ధముచేసి, వేఱుగాపిండము వేయవలయును. మలినము చేనాచ్ఛాదింపఁబడిన బం గారు అగ్నితప్తమయి తనయొక్క మలినముపోయి ప్రకాశము కలిగెడురీతి, సహగ మనముచేసిన పుణ్యాత్మురాలి దేహమును మాత్రము అగ్నిహోత్రుఁడు దహనముచేయునే గాని, దాని జీవమును లేశమయిన నొప్పింపఁడు. తల్లి, తండ్రి, పుత్రుఁడు, పౌత్రుఁ డు, జ్యేష్ఠుఁడు, కనిష్ఠుఁడు, మొదలగువారిని, తక్కిన చుట్టములను, ఇల్లు మొదలగు సంపదలను, ప్రాణమును త్యజించి, భర్తయేదైవము, వాని విడిచియుండుట తగదని వానితో మృతినొందునట్టి యుత్తమురాలికి సమానులు లోకమునందెవ్వరునులేరు. సహగమనముచేసిన పుణ్యాత్మురాలు మూఁడున్నరకోటి దేవవర్షములు స్వర్గమునందు భర్తతో సుఖమనుభవించును. తర్వాత నొక మహాయోగివంశమునందు పెనిమిటియు, మఱియొక యోగివంశమునందు తానును పుట్టి, మఱలవానినే వివాహము చేసికొని యోగమహిమచేత నాధిక్యము చెందును. పురుషునితో మృతిచెందని యాఁడుది యేజన్మ మునందును దుఃఖమే పొందును. అన్యపురుషునికిలోఁబడి, వాని యిష్టమననుసరించి, వాని బోధనచే పురుషుని విడచి, పుట్టినయింటికిని, చొచ్చిన యింటికిని దోషము కలుగ జేయునట్టి యాఁడుది, ఎప్పుడును తీఱని నరకముననుభవించును. పురుషుఁడు తెలిసిన

వాఁడయ్యును, తెలియనివాఁడయ్యును, వాఁడు బ్రతికియుండునప్పుడును, మృతి నొందిన తర్వాతను వాఁడే దైవమని భక్తిచేయుచు, సన్మార్గమునందుండునదియే యుత్తమురాలగును. వివాహమయిన పురుషుని యలక్ష్యము చేయునట్టియాడుది, ఎల్ల వారిచేతను దూషింపఁబడి మఱుజన్మమందొక దుష్టునకు భార్యయయి, వానిచే పలు మాఱు శిక్షింపఁబడుచు మిక్కిలి దుఃఖము నొందును. పురుషుఁడు దేవతారాధనము, అతిథిపూజ, మొదలయినవి చేయునట్టయితే, భార్యయును వానికి యనుకూలము లయినవాని నన్నియు చేయవలయును. బ్రాహ్మణులకు పరిచర్య చేయుటయే శూద్రులకు ధర్మమగునట్లు పతికి శుశ్రూషచేయుటయే సతికి ధర్మమగును. ఈధర్మము అందఱికిని సామాన్యమగును. భర్తయే దైవమని తలఁచి వర్తించునట్టి స్త్రీ మృతినొందిన తర్వాత మేలయిన కులమునందుబుట్టి, యుత్తమ పురుషుని పెనిమిటిగా గలదియయి, సత్పుత్రులనుగని, కులమును వృద్ధిచేసి, తండ్రికిని, మగనికిన్ని, కీర్తి కలుగజేసి, ముత్తైదువుగా మరణమునొంది యుత్తమలోకమును పొందును. మృతినొందినవాఁడు దుఃఖము చెందునట్టులయిన, సుఖము నొందుట్లకై మఱియొక విశేషమును వివరించెద. పండ్రెండవ దినము శాస్త్రప్రకారము సపిండీకరణముచేసి, యొకసంవత్సరమువఱకు నిత్యశ్రాద్ధము ఎవనిగుఱించి చేయఁబడుచున్నదో వాఁడు మాత్రమేగాక, శ్రాద్ధము చేసినవాఁడును మేలుపొందును అని వక్కాణించెను.

పదియేనవ యధ్యాయము

సమాప్తము.

## పదియాఱవ యధ్యాయము.

సూతముని, ఋషులారా! తర్వాత గరుడుఁడు భగవంతుని జూచి, ఓ పరమ పురుషా! ప్రేతజన్మమును గుఱించి యేదైన నొక కథగలదేని దాని జెప్పవలయు ననఁగా, భగవంతుఁడు గరుడా! భక్తుఁడైన నీకు ఆకథ చెప్పెద వినుము. త్రేతా యుగమునందు బభ్రువాహనుండను రాజు ధర్మిష్ఠుఁడుగాను, పెద్దలచే కొనియాడఁదగిన గుణములుగలవాఁడునై మహోదయమను నగరమునందు రాజ్యము చేయుచుండెను. వాఁడొక్కదినము వేటాడఁగోరి యొక మహారణ్య మధ్యమందుండని యొక జింకను జూచి దాని బాణముతోఁగొట్టెను. ఆదెబ్బ తగులుటచేత జింకయాచోటువిడచి పరు

గొత్తెను. అదిజూచి యామృగమును మఱియొక బాణముతో వేయుటకై పూర్వము తగిలిన గాయమునుండి స్రవించురక్తధార చెదరిన మార్గమున నొక్కెడపోయి మఱి యొకవనముచేతి మృగమునుగానక పోవుటచేతను, త్రోవనడచిన శ్రమచేతను, మిక్కిలి సోలినవాడై దాహముచేత నాలుక యెండి నీళ్లకై వనమంతయు వెదకి యొక తామరకొలను జూచి దానియందు స్నానముచేసి జలములుత్రావి యాకొలనిగట్టున నుండెడు యొక వటవృక్షము క్రింద మనపరివారము వచ్చునంతవఱకు నిచ్చట కొంతసే పుండమని కూర్చుండి యుండెను. అప్పుడు ఆరాజు ఎముకలును, నరములును, మాంసమును కొంతయయినను లేని శరీరము గలదియు, వికారమును, చూచుటకు భయమునుకలుగజేయునదియు, అనేక ప్రేతములతో నిచ్చటి కచ్చటికి పరుగెత్తునదియు, క్షుత్పిపాసలచే బాధచెందినదియునైన ప్రేతజన్మము నొందిన యొక జీవునిజూచి, భయమును, ఆశ్చర్యమును పొందెను. ఆప్రేతమును ఆరాజునుజూచి సంతోషముతో దగ్గఱకువచ్చి ఓమహారాజా! నిన్ను నేను దర్శించుటచేత నాప్రేతజన్మము వదలి యుత్తమగతి జెందితిని, ధన్యుడనైతినని వినయముతో జెప్పెను. రాజు ఆప్రేతమునుజూచి నీవెవ్వరు? ఎవ్వరికిని భయంకరమగు రూపముతో ప్రేతమువలె కనుపడుచున్నావు నీయొక్క వృత్తాంతమును సవిస్తరముగా జెప్పవలయుననగా, ప్రేతము ఓమహారాజా! నాయొక్క చరిత్రమును చెప్పుచున్నాను దయచేసి వినవలయును. వైదిశమను నొక పట్టణము గలదు. ఆపట్టణము రథగజతురగపదాతులచే మిక్కిలి ప్రకాశించుచుండును. నేనా పట్టణమునందు వైశ్యకులమున బుట్టితిని. నాకు దేవగుప్తుడని పేరు. బ్రతికియుండు కాలమంతయు దేవతాపూజలు చేసితిని. బ్రాహ్మణులను, పెద్దలను పూజించితిని. దేవాలయములను, బ్రహ్మాలయములను కట్టించితిని, దీదలను, దిక్కులేనివారిని కాపాడితిని, సకల జీవులకును మేలునే చేసితిని. అయువుతీఱి మృతినొందితిని. నాకు పుత్రులును, బంధువులునులేరు. మరణమునొందిన నాకెవ్వరును కర్మము చేయమిచేత నీప్రేతజన్మము నొందితిని. రాజశ్రేష్ఠుడా! ఈప్రేతజన్మము నేనుచెంది బహుకాలమయినది. మిక్కిలి బాధజెందుచున్నాను. మృతినొందినవానికి సంస్కారము, సంచయనము, వృషోత్సర్జనము, షోడశము, సపిండీకరణము, మాసికము, శ్రాద్ధము మొదలగునవి పుత్రులు మొదలగువారు చేయకపోయిరేని వాడు ప్రేతజన్మము నొందును. నీవు లోకమును రక్షించెడు రాజగుటచేత జీవులకును రక్షకుడవయ్యెదవు. మృతినొందిన తర్వాత చేయవలసిన కార్యములను నాకు నీవేచేసి యీప్రేతజన్మమును పోగొట్టవలయును. నాచేతియందుండునది యొక గొప్పరత్నము. దీనికి సమానమగునది యెచ్చటను దొరకుట దుర్లభము. దీని నీకు పాదకానుకగా నిచ్చుచున్నానని యిచ్చెను. రాజు ఓప్రేతమా! నేను నీకు ఎట్లు కర్మము చేయుదును? ఈరత్న

మును నీదగ్గఱనుండి నేను తీయనగునా ? కర్మముచేయక పోవుటచే ప్రేతజన్మము వచ్చినదని చెప్పెదవే మఱియు దేనిచేత నాజన్మము వచ్చును ? చెప్పుమనెను. ప్రేతము రాజును జూచి, బ్రాహ్మణులయొక్క ధనమును దేవతాద్రవ్యమును, స్త్రీ, బాలుఁడు, అంధుఁడు, చెవిటివాఁడు, మూక, మొదలగువారి ద్రవ్యమును వంచించి, యపహరించినవాఁడు ప్రేతజన్మము నొందును. తపస్సు చేయునటువంటి యాడుదానిని, తన గోత్రమునందుబుట్టిన యాడుదానిని, ఇతరుని భార్యయును పొంద గోరినవాఁడు ప్రేతజన్మము నొందును. తామరపూవులను, నవరత్నములను, స్వర్ణమును, రవికెయు దొంగలించినవాఁడు ప్రేతజన్మము నొందును. యుద్ధమునందు వెన్నిచ్చిపాఱినవాఁడును, చేసినమేలు మఱచినవాఁడును, మేలుచేసినవానికే కీడుచేయువాఁడును ప్రేతజన్మము నొందుదురని చెప్పెను. భూపాలుఁడదివిని యో ప్రేతమా ! ప్రేతజన్మము నొందిన వాఁడు ఎట్లు దానినుండి తొలఁగును ? వాని కేవిధముగా కర్మము చేయవలయును ? అనఁగా, ప్రేతము రాజా ! సంగ్రహముగా జెప్పెద వినుము. నారాయణబలి యవశ్యముగా జేయవలయును. మంచి బంగారముతో ఆదిమధ్యాంత రహితుఁడగు శ్రీమన్నారాయణుని దివ్యమంగళ విగ్రహ మొక్కటిచేసి శంఖచక్ర పీతాంబరములతో నలంకరించి, తూర్పున శ్రీధరుని, దక్షిణమున మధుసూదనుని, పశ్చిమమందు వామనునీ, ఉత్తరమునగదాధరుని, నడుమ బ్రహ్మ రుద్రేంద్రులతో శ్రీమహావిష్ణువును ఆరాధించి, ప్రదక్షిణ నమస్కారములుచేసి, అగ్నియందు హోమముచేసి, మఱల స్నానముచేసి, వృషోత్సర్జనముచేసి పదముగ్గురు బ్రాహ్మణులకు ఛత్రము, పాదుకలు, ఉంగరము, ఆసనము, వస్త్రము, స్వర్ణము మొదలగువానినిచ్చి మృష్టాన్నము నిడి, శయ్యాదానము, ఘటదానము మొదలగునవి చేసినట్లులయిన మృతినొందినవాఁడు ప్రేతజన్మమునుండి తొలఁగునని చెప్పెను. ఈవిధముగా నాప్రేతము చెప్పుటయు, నారాజుయొక్క సైన్యములును వచ్చెను. ఆగొప్పసైన్యమును చూచినతోడనే యాప్రేతము కన్నుల కగుపడక మాయమయ్యెను. ఓ! హో ! సేనను జూడగానే ప్రేతము మఱుగునడెనే ఆప్రేతము చెప్పినరీతిగా కర్మము చేయవలయునని తలఁచి యడవినుండిలేచి, పట్టణముచేరి ప్రేతము నుద్దేశించి కర్మముచేసెను. తోడనే యాప్రేతము నాజన్మము విడచి మేలైనగతిజెందెనని చెప్పెను. తర్వాత గరుడుఁడు జగత్కారణునిజూచి సర్వలోక శరణ్యా! మఱియు దేనిచేత ప్రేతజన్మము నివర్తియగును దానిని చెప్పవలయుననఁగా, విష్ణుదేవుఁడు ఓగరుడా ! నూనెచే నిండింపఁబడిన ఘటములను పెద్దలకు దానము చేసినట్లయిన సర్వపాపములు నశించి ప్రేతజన్మమును తొలఁగును. మృతినొందినవానికి సుఖమును కలుగును. స్వర్ణముతో ఘటములు చేసి పాలును నేయియువాని నిండుగబోసి, దిక్పాలకులతోడ బ్రహ్మ విష్ణు మహే

శ్వరులను ఆరాధించి యాఘటములను సద్బ్రాహ్మణులకు దానము చేయుట మిక్కిలి శ్రేష్ఠమగును. అని చెప్పెను.

పదియారవ యధ్యాయము

సమాప్తము.

## పదునేడవ యధ్యాయము.

సూతపౌరాణికుండు తపోశ్రేష్ఠులారా! తర్వాత గరుడుఁడు సర్వేశ్వరుని నమస్కరించి స్వామీ! ఈప్రకారము సంక్షేపముగాచెప్పి కటాక్షించిన చాలదు. కర్మము చేయునప్పుడు స్థలమును గోమయముచేత శుద్ధిచేయవలసినదియెందుకు? పితృకర్మము మొదలగునవి చేయునప్పుడు తిలలును, దర్భయు నుపయోగించునదియెందుకు? మంచముమీదపరుండి మృతినొందినవాఁడును, మేడమీద గతించినవాఁడును సద్గతి పొందనేరరని ముందు చెప్పుటచేత, మృతినొందువాఁడు ఎచ్చోటఎట్లుచావవలయును? దానములన్నియునే ప్రకారముచేయవలయును? చేయునటువంటి దానములకు ఫలమేమి? వీనినంతయు సవిస్తరముగాచెప్పి కటాక్షింపవలయుననఁగా పురుషోత్తముండు, వైనతేయుఁడా! మరణము నొందినవానిగురించి చేయవలసినవానినన్నియు విస్తరించి చెప్పుచున్నాను వినుము. పుత్రుఁడులేనివానికి యేలోకమందును సుఖములేదు. ఇహమందును పరమందును సుఖము గోరువాఁడు ధర్మమును, తపమును చేయఁడేని భార్యయొక్క కడుపునందు పిండోత్పత్తికానేరదు. పిండమును ధరించినను పదిమాసములకు పూర్వమే పతనమగును. గర్భస్రావమగునేని పురుషునికి సద్గతి కలుగనేరదు. సత్పుత్రుని గన్నవాఁడే ఏలోకమందును మేలుపొందును. కర్మము చేయనారంభించు పూర్వమే నియమించుకొనిన స్థలమును చీపురుతో నూడిచి గోమయముతో నలికి పిమ్మట నేకర్మమునైనను చేయవలయును. అట్లు శుద్ధిచేయక కర్మము చేసినట్టులయిన రాక్షులును, భూతప్రేత పిశాచములును, అచ్చటికివచ్చి కర్మము నెఱవేఱక యుండునట్లు భంగముచేయుదురు. శుద్ధిచేసిన స్థలమునందు కర్మము చేసినట్టులయిన దేవతలందఱచ్చటికివచ్చి దాని నెఱవేర్తురు. మృతినొందినవానికి శుద్ధము చేయనిస్థలమునందు కర్మము చేసినట్టులయిన నదిలేశమయినను ఫలము నివ్వక చేసినవాఁడు నరకము నొందును. తిలలు నాయొక్క చెమటచేకలిగినదిగాన మిక్కిలి పరిశుద్ధమయినది. దానిజూచినట్టులయిన రాక్షసులును భూతప్రేత పిశాచములును భయపడి పాఱుదురు.

ఆతిలలు నల్లనివి తెల్లనివియని రెండువిధములుగలవి. ఏవర్ణముగల తిలలనైనను దానము లతోనిచ్చిన నధికఫలము కలుగును. శ్రాద్ధమునందు నల్లనితిలలు చేర్చినట్టులయిన పితృదేవతలు అధిక సంతోషము నొందుదురు. దర్భ ఆకాశమునందు కలిగినది. ఆదర్భ యొక్క కొనలరెంటను బ్రహ్మరుద్రులును, మధ్యను శ్రీహరియునుగలరు. దర్భలేక శ్రాద్ధాది కర్మములేవియు చేయగూడదు. బ్రాహ్మణులకును, మంత్రమునకును, ధర్భ కును, అగ్నికిని, తులసికిని, నిర్మాల్యదోషములేదు. ఉపయోగముచేసిన దర్భయే మఱల నుపయోగింపవచ్చును. ఏకాదశివ్రతమును, తులసీదళమును, భగవద్గీతయును, గోవును, బ్రాహ్మణభక్తియు, శ్రీహరిచరణములును, సంసారసాగరమును తరించు వారికి తెప్పవంటివి. మృతినొందువాఁడు గోమయముచే నలికిన పరిశుద్ధమయిన స్థలము నందు దర్భలను పఱచి, నువ్వులను చల్లి, దానిపైనిపరుండి, దర్భలను, నూవులను చేతబట్టి, నాయొక్కనామములను నోటితో చెప్పుచు మృతినొందినట్టులయన బ్రహ్మ రుద్రేంద్రాదులకు దుర్లభమును సుఖస్థానమునగు నాలోకమును చేఱును. మృతినొందు వాఁడు దర్భయందు బోరగిలిపరుండగూడదు. వీపును క్రిందమోపియేపరుండవల యును. ప్రాణములు విడచుటకు పూర్వమే తులసీదళసహితముగా దానములన్నియు చేయవలయును. లవణదానము చేసెనేని మిక్కిలి శ్రేష్ఠమగును. లవణము విష్ణులోక మందు పుట్టుటచేత దానికి యధిక మహిమకలిగినది. మృతినొందినవాఁడు లవణ దానముచేత స్వర్గలోకమును చేఱును అని చెప్పెను.

పదిమూఁడవ యధ్యాయము

సమాప్తము.

## పదునెనిమిదియవ యధ్యాయము.

సూతుఁడు, ఋషులారా! పరమాత్ముఁడు వేదస్వరూపునిజూచి యోగరుడా! దానములు చేయవలసిన విధములును, ఆదానములచే కలుగు ఫలములను చెప్పుచున్నాను. దానములలో ప్రత్తిదానము మహాదానమగును. వేదజ్ఞులగు బ్రాహ్మణులు ధరించు యజ్ఞోపవీతమునకు ప్రత్తికారణమగుటచేత నది మిక్కిలి విశేషమయినది. ప్రత్తిదానము చేయుటచేత మహాఋషులును, బ్రహ్మరుద్రేంద్రాది దేవతలును సంతోషింతురు. ప్రత్తి దానముచేసినవాఁడు ఆయుస్కాలము దీఱఁగానే శివలోకము పోయి యచ్చట వాసముచేసి, తర్వాత సకలగుణసంపన్నుఁడుగాను, సౌందర్యముగలవాఁడుగాను,

మిక్కిలి బలిష్ఠుఁడుగాను, పృథ్వీపాలుఁడుగాను, దీర్ఘాయువుగాను, భూమియందు పుట్టి, ఎల్లవారిచే కొనియాడఁదగినవాఁడై చిరకాలము జీవించి స్వర్గలోకము చేరును. తిలదానమును, గోదానమును, భూదానమును, స్వర్ణదానమును, ధాన్యదానమును తానే చేసెనేని మహాపాపములన్నియుతోడనే నశించును. గోదానము, తిలదానము మొదలయిన మహాదానములును, భూదానమును ఉత్తమ బ్రాహ్మణులకే చేయవలయును. స్త్రీలకును, తనకు కావలసినవారికిని యామాటిని యుద్దేశముగా నివ్వవచ్చునేగాని దానపూర్వకముగా నివ్వఁగూడదు. దానములు చేయుటకు మరణము నొందు సమయమును, గ్రహణకాలమును, ఉత్తమకాలములగును. ఎవ్వఁడును తాను సుఖముగా జీవించియుండునప్పుడే తనకై దానధర్మములు చేసికొనవలయును. అట్లు చేయ గోరెడువానికి పుత్రుఁడుండెనేని వానియనుమతిని దానము చేయవలయును. మృతినొందు తరుణమందు తిలలును, అయమును, లవణమును, ప్రత్తియు, ధాన్యమును, స్వర్ణమును, భూమియు, గోవును దానము చేసినట్టులయిన మిక్కిలి శ్రేష్ఠమగును. తిలలును, అయమును దానము చేసినట్టయిన యముఁడు సంతోషించును. లవణదానము చేత మృతినొందినవానికి యమభయము కలుగదు. ప్రత్తిదానము చేయువానికి యముని భయమును దూతలభయమును కలుగదు. ధాన్యదానము చేసెనేని యముఁడును, దూతలును సంతోషించి జీవునికి కావలసినవన్నియు నిత్తురు. స్వర్ణదానము చేతను, భూదానముచేతను, గోదానముచేతను పాపములన్నియు నశించునని ముందే చెప్పితిని. మరణము నొందువాఁడు నన్నే ధ్యానించి నాయొక్క నామమునే యుచ్చరించెనేని, మోక్షము చెందును. తండ్రి గతించిన వెనుక పుత్రుఁడు వానికి గయాశ్రాద్ధము చేయుటకంటె తండ్రి మృతినొందు సమయమున పుత్రుఁడు దగ్గఱనుండి దానధర్మములు చేయుటయే యుత్తమమగును. కుఠారమును, ముసలమును, సురియయును లోహదండమును యమునియొక్క ఆయుధములు. సామాన్యముగా యినుము యమునికి యాయుధమగును. కాఁబట్టియే మరణకాలమునందు ఇనుముదానము చేసినట్టులయిన యముఁడు సంతోషించునని చెప్పితిని. మఱియును ఎవ్వని మరణకాలమునందు ఏగృహమందు అయదానము చేయఁబడుచున్నదో ఆగృహమునందు యముఁడడుగు బెట్టవెఱచును. మరణము నొందువాఁడెవ్వఁడైనను అయదానము చేయవలయును. దానిచే చండామృగుఁడు, ఔదుంబరుఁడు, శంబరుఁడు, శార్దూలుఁడు మొదలగు యమదూతలు తృప్తిచెందుదురు. ఓగరుడా! జీవునియొక్క కాలుమొదలు తల పర్యంత ముండు అంగములయందు బ్రహ్మరుద్రేంద్రాది దేవతలును, విష్ణువును వసించెదరు. జీవునికి తల్లియు, తండ్రియు, గురువును, చుట్టములును నేనేగాని వేరెవ్వరును లేరు. "సర్వం విష్ణుమయం జగత్" అను వాక్యము నీవు తెలిసినదేగదా. పృథివి, అప్పు,

తేజము, వాయువు, ఆకాశమును, స్వర్ణమును, ధాన్యమును, మధువును, ఆజ్యమును, గోవును, యాగమును, బ్రాహ్మణులును, బ్రహ్మరుద్రేంద్రాది దేవతలును, దాతయును, ప్రతిగ్రహీతయును, మఱియెవ్వరును, ఏవియు నేనే నేగాని వేఱుగాదు. బ్రహ్మరుద్రేంద్రాదులు చేయుకర్మములకు ఫలము నిచ్చువాఁడును నేనే. జీవుఁడు పూర్వము చేసిన కర్మమున ననుసరించి పాపపుణ్యములయందు బుద్ధిని ప్రవేశింప జేయుచున్నాను. పుణ్యము చేసినవాఁడు స్వర్గమునకు బోవును. పాపము చేసినవాఁడు నరకమునకు బోవును అని చెప్పెను.

పదునెనిమిదియవ యధ్యాయము

సమాప్తము.

## పందొమ్మిదియవ యధ్యాయము.

సూతమహాముని, మహాఋషులారా! అనంతరము జగత్కారణుఁడైన భగవంతుండు గరుడా! నన్నారాధించి నాయొక్క క్షేత్రములయందు దానధర్మములు చేయువాఁడు అధిక పుణ్యము నొందును. మృతినొందిన జీవునిగుఱించి భూదానము చేసినట్టులయిన దానము చేయఁబడిన భూమియెన్ని యడుగులు గలవో అన్ని సంవత్సరములు ఆజీవుఁడు స్వర్గమునందువసించును. పాదుకాదానము చేత గుఱ్ఱము మీదనెక్కి మంచిలోకమునకు బోవుననుటయేగాక, మార్గమునందు ముండ్లు మొదలగు వానిచేత బాధయును పొందఁడు. ఛత్రదానము చేత నీడగల మార్గమునందు పోవుననుటమాత్రమేగాక, వర్షము చేతను బాధ చెందఁడు. ఆశ్వయుజ కార్తిక మాఖమాసములయందైనను, చతుర్దశియందైనను, పౌర్ణమియందయినను, మృతదినమునందైనను దీపదానము చేసినట్టులయిన ముందుజెప్పినరీతిగా చీకటిమార్గమునందు ప్రకాశముతోనేగును. మరణదినము మొదలు ఒక సంవత్సరపర్యంతము నిత్యమును దీపదానము చేసినట్టులయిన మృతినొందినవాఁడు మిట్టపల్లములులేని మంచిమార్గమునందు యమపురిచేరి వానికులము వారచ్చటయుండిరేని వారిని సద్గతిని జేర్చి, తానును సద్గతినొందును. దీపదానముయొక్క మహిమయింతయేగాదు. బ్రహ్మాలయములందును, దేవాలయములందును ఉత్తరముఖముగానైనను, తూర్పుముఖముగానైనను దీపముంచవలయును. దీపదానము చేయువాఁడు తనకు అభిముఖముగా దీపమునుంచి దానము చేయవలయును. మరణమనునది నిశ్చయముగా నుండుటను నమ్మువాఁడు పైజెప్పినదానములను తానే తనకు చేసికొనవలయును. ఆసనమును, తామ్రస్థాలియు,

స్వయంపాక సామగ్రియు దానము చేసెనేని మరణము నొందినవాఁడు మార్గమునందు సుఖముగాబోవును. బియ్యమును, నువ్వులును, పదమూఁడు ఘటములును, ఉంగరమును, ఛత్రమును, వీవనయు, పాదరక్షలును, అవశ్యముదానము చేయవలయును. ఏనుఁగును, గుఱ్ఱమును, దానముచేసినట్టులయిన విశేష పుణ్యముగలుగును. ఎనుపగొడ్డును మిక్కిలి ద్రవ్యముతోఁడ దానము చేసెనేని మిక్కిలి విశేషమగును. తాంబూలము, పుష్పములు దానముచేసిన యమదూతలు సంతోషించి, జీవుని బాధింపరు. వస్త్రదానము చేసెనేని మేఘమువలె నల్లని శరీరమును, కోఱపండ్లును, ఎఱ్ఱని వెండ్రుకలును భయంకరరూపమును గలిగిన యమదూతలు జీవునికిముందు సుస్వరూపముతో కనుపడుదురు. అని చెప్పెను. గరుడుఁడు వైకుంఠుని నమస్కరించి, భక్తపరాధీనా! శరీరమునుండి జీవమెట్లు వెడలును అనఁగా సర్వాంతర్యామియగు భగవంతుఁడు వైనతేయా! కన్నులగుండానైనను, చెవులగుండానైనను, ముక్కుగుండానైనను, నోటిగుండానైనను, కేశరంధ్రములగుండానైనను, జీవము పోవును. జ్ఞానులకు కపాలము పగిలి జీవము పోవును. పాపులకు అపానమార్గముగా బోవును. ప్రాణము పోయినతోడనే శరీరము కట్టెవంటిదియగును. దేహము పాంచభౌతికమగుటచేత పృథివిమంటియందును, అప్పు జలమందును, తేజస్సు అగ్నియందును, వాయువు గాలియందును, ఆకాశము ఆకాశమందును లయమగును. కామక్రోధలోభమోహ మదమాత్సర్యములాఱును, కర్మేంద్రియములైదును, జ్ఞానేంద్రియములైదును శరీరమునందు దొంగలవలె వసించియున్నవి. ప్రాణము పోవునపుడు ఆయింద్రియములు మనస్సుతో నొక్కటిగా చేలును. చేతనుఁడు కర్మముచేతనే మఱుజన్మమునొందును. శిథిలమయిన యిల్లుగలవాఁడు ద్రవ్యము సంపాదించి క్రొత్తయింటిని గట్టి దానియందు వాసముచేయ ప్రవేశించునట్లు పుణ్యముచేసిన జీవుఁడు జీవితకాలము ముగియగానే పంచేంద్రియములతో గూడిన యొక దివ్యదేహమును పొందును. మలమూత్రములును, కఫపిత్తములును, మాంసమును, చీమును, నరములును, ఎముకలును శరీరములో దహింపఁబడుచున్నవి. జీవుఁడు మరణము నొందువిధమిట్టిది. మఱల పుట్టునట్టి విధమును చెప్పుచున్నాను వినుము. పెక్కునరములతోఁడ స్తంభాకృతిగలిగిన యొక నరము కలిగినదియు, ఇంద్రియములతో గూడినదియు, కామక్రోధలోభమోహ మఁదమాత్సర్యములనెడు, లోపగవారితో గూడినదియు, రాగద్వేషములచేత వ్యాపింపఁబడినదియు, మాయతోగూడినదియునగు దేహము సకల జీవులకును, నిశ్చయముగాకలుగును. సమస్తలోకములును, సకల దేవతలును, దేహమందు వసించెదరు అని చెప్పెను.

పందొమ్మిదవ యధ్యాయము
సమాప్తము.

## ఇరువదియవ యధ్యాయము.

సూతపౌరాణికుండు నైమిశారణ్యవాసులారా! గరుడుండు పరమపద నాధునిజూచి సర్వలోకశరణ్యా! తోలు, నరములు, శల్యములు, నెత్తురు, మాంసము, శిరస్సు, చేతులు, కాళ్లు, నాలుక, ముక్కు, గుహ్యము, గోళ్లు, వెండ్రుకలు మొదలగు వానిచేత, నిండి యింద్రజాలమువలె తోచునట్టి శరీరమెట్లుకలుగుచున్నది? కటాక్షింపవలయుననఁగా, భగవంతుఁడు గరుడా! సవిస్తరముగా జెప్పుచున్నాను వినుము. ఋతుమతులగుస్త్రీలు నాలుగుదినములవఱకు గృహమునకు వెలుపలనుండవలయును. మునుపొక కాలమందు దేవేంద్రుఁడు వృత్రాసురుఁడను వాని చంపుటచేత వాని బ్రహ్మహత్యపీడించినది. ఆ ఇంద్రుండు బ్రహ్మవద్దికిబోయి స్వామీ! నేను పడు దుఃఖమును దీర్పవలయునని ప్రార్థింపఁగా, నాబ్రహ్మదేవుఁడు, ఇంద్రుని పీడించిన బ్రహ్మహత్యదోషమును నాలుగు భాగములుచేసి యొక భాగమును స్త్రీలకునిచ్చి, రజస్వలయగునప్పుడా స్త్రీలయందా దోషము చేయునట్లు నియమించెను. వానిచేత బహిష్ఠయగు స్త్రీని నాలుగుదినములవఱకు నెవ్వరును జూడకూడదు. చూచిరేని మహాపాతకము సంభవించును. బహిష్ఠయయినయాఁడుది మొదటిదినము చండాలస్త్రీకిని, రెండవదినము బ్రహ్మహత్య చేసినదానికిని, మూఁడవదినము చాకలదానికిని సమానమగును, నాలుగవదినము స్నానమయిన తర్వాత కొంచము పరిశుద్ధముగలదియగును. ఐదవదినము గృహకృత్యములకంతయు తగిన పరిశుద్ధముగలదియగును. బహిష్ఠయయిన యాఱవదినము మొదలు పదునెనిమిదిదినములవఱకు గలిగిన ఏఁడుజంటదినముల రాత్రులయందు పురుషుఁడు గూడెనేని పురుషప్రజయును, ఐదవదినము మొదలు పదునెనిమిది దినములవఱకు గలిగిన ఏఁడు బేసిదినముల రాత్రులయందుగూడెనేని స్త్రీప్రజయును కలుగును. కాఁబట్టి మగశిశువు గోరువాఁడు తన భార్యను జంటదినములయందుగూడవలయును. నాలుగుదినములోపు తర్వాత పదునెనిమిది దినములవఱకు రాత్రులయందు జంటదినములలో గర్భము ధరించెనేని గుణవంతుఁడును, ఐశ్వర్యవంతుఁడును, ధర్మిష్ఠుఁడును విష్ణుభక్తిగలవాఁడునైన పుత్రుఁడు గలుగును. విశేషముగా బహిష్ఠయయిన నాలుగు దినములకు తర్వాత నెనిమిదిదినములలోపల గర్భము ధరించును. రజస్వలయయిన ఐదవదినమందు స్త్రీలు పాయసము మొదలగు మధురములగు పదార్థములనే భుజింపవలయును. కారమైన పదార్థములను భుజింపఁగూడదు. స్త్రీపురుషులు చందనము, పువ్వులు తాంబూలములనెడు శీతపదార్థములను ధరించుకొని శైత్యదేహమును, మనస్సునందు మిక్కిలి మోహమునుగలవారై కూడవలయును. అట్లు

యిరువురును గూడినచో శుక్లశోణితములచేత స్త్రీయొక్క కడుపునందు గర్భము ధరించి శుక్లపక్ష చంద్రునివలె యాపిండము వృద్ధియగును. మన్మథుఁడును, మనస్సును చేతిన కాలమందు యిరువురిచేతను విడువఁబడు శుక్లశోణితములలో శుక్లమధికమాయెనేని మగశిశువును శోణితమధికమగునేని యాడుబిడ్డయును కలుగును. శుక్లశోణితములు రెండును సమమగునేని నపుంసకుఁడైన శిశువు కలుగును. గర్భము ధరించెనేని కూడిన నైదుదినములలోపల గర్భకోశమునందు బుగ్గయొకటి కలుగును. పదునాలుగు దినములలో నది కొంతమాంసముచేత వృద్ధియగును. ఇరువదియవదినమందు మఱియుఁ కొంత వృద్ధియగును. ఇరువదియైదవదినమందు మఱియు కొంతపుష్టియగును. ఒక్కమాసము లోపల పంచభూతములయొక్క చేఱికకలుగును. రెండవమాసమునందు చర్మమును, మూఁడవమాసమునందు నరములును, నాలుగవమాసమునందు కేశములును, కనుబొమలును, ఐదవమాసమునందు చెవులును, నాసికయు, గాత్రమును, ఆఱవమాసమునందు మెడయును, శిరస్సును, దంతములును, ఏఁడవమాసమునందు మగశిశువయ్యెనేని మగరూపును, ఆడశిశువయ్యెనేని యాడురూపును, ఎనిమిదియవ మాసమునందు సకలావయములును కలిగి, జీవుఁడును ప్రవేశించుచున్నాఁడు. తొమ్మిదియవమాసమునందు జీవుఁడు సుషుమ్నానాడీస్థానమందుండి, పూర్వజన్మకర్మములను తలఁచి, జన్మము వచ్చుటను గుఱించి దుఃఖించి పదియవమాసమునందు పుట్టుచున్నాఁడు.

గరుడా! పంచభూతాత్మకమగుదేహము పంచేంద్రియములుగలదియు, దశవిధనాడులచే నలంకరింపఁబడినదియు, ప్రాణాపానవ్యానోదానసమాన, నాగకూర్మకృకరదేవదత్తధనంజయములనెడు దశవిధవాయువులచే గూడినదియయియున్నది. మఱియు నాశరీరము శుక్లము, మాంసము, యెముకలు, నీరు, కేశములు, రక్తములనునట్టి యాఱుకోశములను గలిగినదియునైయున్నది. నరములచేత కట్టఁబడియుండెడు స్థూలశరీరమునందు చర్మమును, ఎముకలును, వెండ్రుకలును మాంసమును, నఖములును, పృథివియొక్కగుణమగును. నోటియందూఱుజలమును, మూత్రమును, శుక్లమును, చీమును, అప్పుయొక్క గుణమగును, ఆకలియు, దాహమును, నిద్రయు, సోమరితనమును, కాంతియు తేజస్సుయొక్క గుణమగును. ఇచ్ఛయు, కోపమును, సిగ్గును, భయమును, మోహమును, ఇచ్చటికచ్చటికి పరుగెత్తుటయు, చుట్టుటయు చేతులు కాళ్లు ముడుచుటయు, చాపుటయు, ఏమియుచేయకుండుటయు, వాయువుయొక్క గుణమగును. శబ్దమును, తలఁపును, వినుటయు, గంభీరమును, సత్యమును, ఆకాశముయొక్క గుణమగును. చెవులును, నేత్రములును, నాసికయు, జిహ్వయు, చర్మమనగు నట్టి యైదును జ్ఞానేంద్రియములగును. ఇడ, పింగళ, సుషుమ్నయను మూడు గొప్ప నాడులును, మఱియు గాంధారి మొదలగు సప్తనాడులును శరీరముయొక్క ముఖ్య

నాడులగును. జీవుఁడు భుజించు అన్నము మొదలగు వానిని పైజెప్పిన. వాయువులే ఆయాచోటికి చేర్చుచున్నవి. కడుపునందు అగ్నికిపైనిజలమును, జలమునకు పైని యన్నమునుండును. ఆయగ్నిని వాయువు ఊది, వృద్ధిజేయుచున్నది. శరీరము, మూడున్నఱకోటి రోమములును, ముప్పదిరెండు దంతములును, ఇరువది నఖములును, ఇరువదియేడుకోట్లు తల వెండ్రుకలును, *వేయిపలములు మాంసమును, నూఱుపలములు రక్తమును, పదిపలములు చీమును, పదిపలములుతోలును, పండ్రెండు పలములు మజ్జయు, మూడుపలములు ముఖ్య రక్తమును, కఫమును, మలమును, మూత్రమును గూడి సృష్టింపఁబడియున్నది. అండమునందుండునవి యన్నియు దేహమందుండును. అరకాలు అతలమనియు, చీలమండవితలమనియు, మోకాలుసుతలమనియు, దానికి పైని నితలమనియు, తొడతలాతలమనియు, గుహ్యము రసాతలమనియు, నడుము పాతాళమనియు, నాభిభూలోకమనియు, ఉదరము భువర్లోకమనియు, హృదయము సువర్లోకమనియు, భుజములు మహాలోకమనియు, ముఖము జనోలోకమనియు, నుదురు తపోలోకమనియు, శిరము సత్యలోకమనియు చెప్పఁబడును. త్రికోణము మేరు పర్వతమనియు, అధోకోణము మందరపర్వతమనియు, ఆకోణమునకు కుడిప్రక్క కైలాసమనియు, ఎడమప్రక్క హిమాలయమనియు, పైభాగము నిషేద పర్వతమనియు, దక్షిణభాగము గంధమాదనమనియు, ఎడమచేతి లోభాగమందలి రేఖ వరుణ పర్వతమనియు చెప్పఁబడును. ఎముకలు జంబూద్వీపమనియు, మేదము శాఖద్వీపమనియు, మాంసము కుశద్వీపమనియు, నరములు క్రౌంచద్వీపమనియు, చర్మము శాల్మలిద్వీపమనియు, కేశములు ప్లక్షద్వీపమనియు, నఖములు పుష్కరద్వీపమనియు చెప్పఁబడును. మూత్రము లవణసముద్రమనియు, నీరు క్షీరసముద్రమనియు, కఫము కల్లుసముద్రమనియు, మజ్జ నేతిసముద్రమనియు, ఉమ్మినీరు ఇక్షుసముద్రమనియు, రక్తము పెరుగు సముద్రమనియు, నోటియందూరెడు తియ్యని నీరు మంచినీళ్ల సముద్రమనియు చెప్పఁబడును. శరీరమందు రెండు చక్రములు గలవు. వానియందు నాదచక్రమందు సూర్యుఁడును, బిందుచక్రమునందు చంద్రుఁడును, నేత్రములయందు అంగారకుఁడును, హృదయమునందు బుధుఁడును, వాక్కునందు బృహస్పతియు, శుక్లమునందు శుక్రుఁడును, నాభియందు శనియు, ముఖమునందు రాహువును, కాళ్లయందు కేతువును గలరు. మనుష్యునియొక్క శరీరమందు పదునాలుగులోకములును, సప్తకులపర్వతములును, సప్తద్వీపములును, నవగ్రహములునుండు రీతిని జెప్పితిని. జీవుఁడు గర్భవాసము చేయునప్పుడే యాజీవునికి యాయుస్సు యింతయనియు, విద్య యింతయనియు, భోగమును, యోగమునింతయనియు, ఈకాలమునందీవిధముగా మరణము కలుగదగినదనియు, పూర్వకర్మము ననుసరించి బ్రహ్మదేవుఁడు

విధించుచున్నాఁడు. కాఁబట్టి దీర్ఘాయువును, మిక్కిలి విద్యయును, భోగమును, యోగమును, మొదలగు వాని నన్నియుం మఱుజన్మమునందు లభించుటకై జీవుఁడు సత్కర్మములు చేయవలయునని శాస్త్రము చెప్పుచున్నది. జీవుఁడు పూర్వజన్మము నందు చేసిన కర్మముయొక్క ఫలమునే మఱుజన్మమునందు పొందుచున్నాఁడనుటకు లేశమయినను సందేహములేదు. లోకోపకారార్థము నీకు అన్నియు చెప్పితిని మఱి యు నేదైన నడుగవలసియుండిన దానిజెప్పుచున్నాను అని చెప్పెను.

ఇరువదియవ యధ్యాయము

సమాప్తము.

## ఇరువదియొక్కటియవ యధ్యాయము.

---

సూతుఁడు ఋషులనుజూచి మహాఋషులారా! భగవంతుఁడు ఈప్రకారము చెప్పఁగా గరుడుఁడు స్వామీ! యమలోక మెచ్చటనున్నది? ఆలోకమునకు పోవు నట్టి మార్గముయొక్కరీతిని నాకు మఱియు విస్తరించి చెప్పవలయునని ప్రార్థింపఁగా భగవంతుఁడు గరుడునిజూచి వైనతేయా! పూర్వమే దానిరీతిని చెప్పియున్నాను. మఱియును యమపురికిబోవు మార్గముయొక్క కొంతభాగము కరిగించిన తామ్రమును వలె జ్వలించుచుండును. కొంతభాగము ముండ్లచేతను మండుచుండెడు కొఱవుల చేతను, నిండియుండును. కొంతభాగము సహింపగూడని చలితోగూడియుండును. భూలోకమునకును యమలోకమునకును ఎనుబదియాఱు వేలామడదూరమని ముందే చెప్పితిని. ఆంతదూరమందును పాపముచేసిన జీవునికి చెట్టుయొక్కనీడగాని, త్రాగు టకు నీరుగాని లేశమయినను దొఱకుట దుర్లభము. పాపులకు యమలోకమును దానికి బోవు మార్గమును మిక్కిలి క్రూరముగానేయుండును. ఇంక యమలోకముయొక్క సుఖములను చెప్పెద వినుము. దక్షిణదిక్కునకును నైఋతిదిక్కునకును మధ్య, యమ పురము వజ్రమయమును, దేవాసురుల కజేయమునైయుండును. ఆపట్టణము నడుమచదురముగా నూఱుయోజనముల వైశాల్యముగలదియును, ఇరువదియయిదు యోజనముల పొడవుగలదియును, అనేక గవాక్షములు గలిగినదియు, ధ్వజములచేతను, ముత్యపు తోరణములచేతను, మకరతోరణములచేత నలంకరింపఁబడినదియును, స్వర్ణ మయమునై ధర్మరాజుయొక్క నగరు ప్రకాశించుచుండును. ఆనగరునందు పది

యోజనముల వైశాల్యమును, అనేకవేల వజ్రమయ స్తంభములు గలిగినదియు, శైత్యసౌరభములుగల మలయమారుతము వీచునదియు, ఎల్లప్పుడును ఆటపాటలచేత నొప్పినదియునైన యొక దివ్యమంటపముగలదు. ఆమంటపమునందు దూతలు ముకుళిత హస్తులై యొక ప్రక్కను, రోగములన్నియు ఘోరరూపములుగలవియై మఱియొక ప్రక్కను, పరివేష్టించియుండగా, చూచువారు భయపడదగినరూపముతోడను సంతోషముతోడను యముఁడు కొలువైయుండును. ఆయముఁడు కొలువుండు మంటపమునకు ప్రక్కను ఇరువదియయిదు యోజనముల వైశాల్యముగలదియు, పదియోజనములపొడవుగలదియు, పలువిధయలంకారములు గలదియునైన చిత్రగుప్తునియొక్క నగరుండును. ఆనగరునందొక దివ్యమంటపమునందు చిత్రగుప్తుఁడు కొలువుండి సకల జీవులు చేయు పాపపుణ్యములను కొంతయయినను పొరపాటులేక లెక్క వ్రాయుచుండును. ఆచిత్రగుప్తుని నగరునకు పూర్వభాగమందు శూలనొప్పితో స్ఫోటకమునకును, పశ్చిమ భాగమునందు కాలపాశముతో సర్వగ్రరోగమునకును, అరుచికిని, ఉత్తరభాగమునందు కడుపునొప్పికిని, ఆగ్నేయభాగమునందు మూర్ఛారోగమునకును, నైఋతిభాగమునందు అతిసారరోగమునకును, వాయువ్యభాగమునందు సన్నిపాతరోగమునకును గృహములుగలవు. ఆరోగములన్నియు యమునియొక్క ఆజ్ఞను యెదురుజూచుచు తమ గృహములందుండును.

ఓయిగరుడా! ఆయమునియొక్క నగరునకు దక్షిణభాగమునందు పాపము చేసిన చేతనులను యమదూతలు పలువిధముల హింసించుచుందురు. కొందఱు జీవులను రోకండ్లచే మొత్తుదురు. కొందఱిని యాయుధములచే ఛేదింతురు. కొందఱిని సురియలచే చెక్కుదురు. కొందఱిని గానుగలయందువేసి త్రిప్పుదురు. కొందఱిని ఇనుపశలాకలగ్రుచ్చి యగ్నియందు వాడ్తురు. తామ్రముతో నొక స్త్రీప్రతిమయును, పురుషప్రతిమయును చేయఁబడి యెప్పుడును అగ్నియందు కాలుచుండును. దూతలు పరస్త్రీని గూడిన పాపులనుజూచి, పాపులారా! ధర్మమును, మానమునుజూడక పరస్త్రీలను గూడుటచేత కలిగిన ప్రయోజనము ఇదియేయని యాస్త్రీప్రతిమతో వారిని చేర్చుదురు. అన్యపురుషులతోగూడిన స్త్రీలను ఆప్రకారమే యాపురుష ప్రతిమతో చేర్చుదురు. పురుషుఁడు తన భార్యవినా పరభార్యను గూడినందుకును, స్త్రీ తన పురుషుఁడుగాక మఱియొక పురుషుని గూడినందుకును యమలోకమునందు కలుగు దండనలివియే. ఇట్లు క్రూరమగు దండనలుండియు స్త్రీపురుషులయందు సన్మార్గము నందుండు వారిని జూచుట యరుదుగానున్నది. కొందఱిని చెఱకుగడలవలె యంత్రములయందు చొప్పింతురు. కొందఱిని నరకములందు త్రోసి పాతాళమువఱకు అను

ముదురు. ఋణము చేసి యాఋణమును దీర్పనివారిని కోపించి కొట్టుదురు. పాపుల యొక్క దుఃఖమును విశేషించి చెప్పుటచేత ఫలమేమి? వీఁడు ధర్మిష్ఠుఁడనియు, వీడు అధర్మిష్ఠుఁడనియు, వీఁడు స్వర్గము చెందువాఁడనియు, వీఁడు నరకము నొందు వాఁడనియు, వారివారి నడవడులవల్లనే తెలియును. ధర్మము చేసినవాఁడే స్వర్గము చెందుననుట నిశ్చయమగుటచేత నెల్లవారును ధర్మమునే చేయవలయునని చెప్పెను.

ఇరువదియొక్కటియవ యధ్యాయము
సమాప్తము.

## ఇరువదిరెండవ యధ్యాయము.

సూతుఁడు మహాఋషులారా! వాసుదేవుండు వేదరూపునిజూచి గరుడా! మఱికొన్ని ధర్మములను చెప్పుచున్నాను వినుము. మనుష్యులు కృతయుగమునందు తపముచేయుట యుత్తమమగును. త్రేతాయుగమునందు భగవంతుని ధ్యానించుట యుత్తమమగును. ద్వాపరమునందు యాగములుచేయుట యుత్తమమగును. కలియుగమునందు దానముచేయుటయే యుత్తమమగును. గృహస్థ ధర్మమునందుండు వానికి యేయుగములయందును యాగాది కర్మములు చేయుటయు, గుళ్లు, గుంటలు, సత్రములు, తోటలు, మొదలగువానిని ప్రతిష్ఠచేసి ధర్మము చేయుటయు, అతిథిపూజ చేయుటయునే యుత్తమములగును. గృహస్థాశ్రమమందుండువాఁడు తన దాయాదుల యందెవ్వరైన గతించి యుండినవారినిగుఱించి తర్పణము చేయవలయును. మృతినొందిన వాఁడు ఆజలములచేత సంతోషించును. మూఁడు చిన్నరాళ్లను దారముచేతకట్టి నాలుగు త్రోవలుగూడుచోట మృతినొందిన దినము మొదలు మూఁడుదినములు రాత్రులయందు పారవేయవలయును. సంచయనము చేసినవెనుక దాయాదులందఱు గతించినవానికి తర్పణము చేయవలయును. మొదటి మూఁడువర్ణస్థులగు, బ్రహ్మక్షత్రియ వైశ్యులకు శూద్రుఁడు తర్పణము చేయనగును. బ్రహ్మక్షత్రియులకు వైశ్యుఁడు చేయనగును. క్షత్రియుఁడు బ్రాహ్మణునికి చేయనగును. బ్రాహ్మణుఁడు తన కులమువారికేగాని తక్కినవారికి చేయవగదు. శూద్రశవముతో బ్రాహ్మణుఁడు స్మశానమునకు బోయె నేని యాబ్రాహ్మణునికి మూఁడుదినములకు ఆశౌచముగలదు. మూఁడుదినములు, గడచినవెనుక వాఁడు కావేరి స్నానముచేసి శుద్ధుఁడు కావలయును. మృతినొంధిన వానికి కర్మము చేయువాఁడు మూడుమెత్తపైని బరుండకూడదు. మృతినొందినవాని

యొక్క సద్గుణములను ఎప్పుడును విశేషముగా చెప్పవలయును. యమునిగుఱించి స్తోత్రము చేయవలయును. పదిదినములలో వేయుచున్నటువంటి పిండములచేత మృతి నొందినవానికి శరీరము కలుగుటచేత పదిదినముల కర్మలను తప్పక చేయవలయును. అట్లు చేయనియెడల మృతినొందినవాఁడు శరీరము లేనివాఁడై దుఃఖించును. విలు విద్యనేర్చినవాఁడు గుఱిబెట్టి బాణమువేసిన నాబాణము గుఱియందు తప్పక తగులు నట్లు అనేక శాస్త్రములను తెలిసిన సత్పుత్రుఁడు, మృతినొందిన తన తల్లిదండ్రులను గుఱించి చేయు కర్మఫలము వారిని తప్పక చేరును. మృతినొందిన జీవుఁడు మూఁడు దినములు నీటియందును, మూఁడుదినములు అగ్నియందును, మూఁడుదినములు ఆకాశ మందును, ఒకదినము గృహమునందును నసించును. మొదటి దినమందును, మూడవ దిన మందును, ఐదవదినమందును, ఏడవదినమునందును, తొమ్మిదియవదినమందును పద కొండవదినమందును నవశ్రాద్ధము చేయవలయును. మొదటి దినమునందేచోట తర్ప ణము మొదలయినవి చేయఁబడినవో ? ఆస్థానమందే పదిదినములును చేయవలయును. బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులలో నేయేజాతికి యెన్నిదినములు ఆశౌచము విధింపఁ బడియున్నదో ? అన్ని దినములును పిండతర్పణములు తప్పక చేయవలయును. ఏతిథియందు మృతినొందునో ? ఆతిథియందు మాసికము చేయవలయును. పదకొం డవదినమందు భక్ష్యములతో నన్నముపండి నాలుగు సంధులయందువేసి స్నానము చేయవలయును. అధిక కష్టమునొంది యొకఁడు మరణము చెందెనేని వానిగుఱించి యేకోద్దిష్ట శ్రాద్ధము విశేషముగా చేయబడినట్లులయిన వాఁడు దుఃఖమునువిడచి సుఖము నొందును. ఆయేకోద్దిష్ట శ్రాద్ధము క్షత్రియుఁడు పండ్రెండవదినమందును, వైశ్యుఁడు పదియేనవదినమందును చేయవలయును. తల్లిదండ్రులు మరణము నొంది నను, బిడ్డ కనినను శూద్రులకు ఒకమాసమువఱకు నాశౌచముకలదు. ఒకపక్షము వఱకనుటయు కొందఱి యభిప్రాయము. శూద్రుఁడు పదియేనవదినమునకు పిమ్మట యేకోద్దిష్టము చేయవలయును. ఒకఁడు గతించెనేని పదిదినములు ఆశౌచము కలిగినవాని దాయాది కర్మము తీఱినవెనుక మూఁడుమాసములకులోపల నెప్పుడు వినినను వానికి మూఁడుదినములు సూతకముగలదు. మూఁడుమాసములకు తర్వాత నాఱుమాసము లకులోపల వినినట్లులయితే తొంబదిఘడియలు సూతకము గలదు. ఆఱుమాసము లకు తర్వాత నొక్క సంవత్సరములోపల వినెనేని యొకదినముమాత్రము సూతకము గలదు. సంవత్సరము ముగిసిన తర్వాత వినెనేని వినినతోడనే స్నానము మాత్రము చేయవలయును. ఈవిధి సకల వర్ణస్థులకు సామాన్యము. పక్షీంద్రా ! శయ్యా దానము చేయవలయునని ముందే చెప్పితిని. ఏపురుషుఁడును ఆదానమును తన చేతితోనే చేయవలయును. చక్కని మ్రానితో మంచముచేసి స్వర్ణముచేతను, రజి

సాశ్రమమును బొందినవాఁడు ఆయాశ్రమమునకుదగిన యాచారమును వదలినట్టు లయిన నేగతిచెందును ? వీనినన్నియుఁ జెప్పి గటాక్షింపవలయుననఁగా, భగవంతుఁడు గరుడా ! ఎవ్వఁడు ఆహార వ్యవహారము లెవ్వియు లేక, నియమముతో దర్భశయ నము చేసి నన్ను ధ్యానించుచు మరణము నొందునో ? వాఁడు నాలోకమును చేరును. దానిచేత నాప్రాయోపవేశము శ్రేష్ఠమైయున్నది. ఒక్కఁడు ప్రాయోపవేశముచేసిన దినములెన్నిగలవో ? అన్ని దినములకును దినమొక్కటికి యొక్కయాగఫలమువానికి కలు గును. మహారోగముచేత బాధచెంది, యికను జీవింపనక్కఱలేదని ప్రాయోపవేశము చేసి, నన్ను ధ్యానించి మృతిజెందువాఁడును మంచిగతియేపొందును. మృతిజెందు టకు ప్రాయోపవేశముచేసి, నడుమలేచి సంసారసుఖమును గోరినట్టులయిన, వాఁడు బ్రాహ్మణుల మూలముగా ప్రాయశ్చిత్తముచేసికొని తర్వాత ధర్మమార్గమునందు నడువ వలయును. సన్న్యాసముచేసికొని, నియమముతోనుండి మృతినొందినవానికి, వాఁడు ఆయాశ్రమము చెందినదినము మొదలు మృతినొందినదినమునకు కలిగిన దినములకు, దినమొక్కటికి రెండు యాగముల ఫలము కలుగును. వ్యాధిచే బాధచెంది మరణ కాలము సమీపించినదియని తలంచి సన్న్యాసాశ్రమముపొంది తర్వాత వ్యాధికుదిరి, బ్రతికి సంసారమునందు చేరునేని వాఁడు మహారోగము పొందును. వానికంటె పాపి యెవ్వఁడును లేడు. వాని నెవ్వరును చూచుటయునుగూడదు. గృహదారా పుత్రాదులను చిరకాలమువిడచి బహుదూరముచని తీర్థయాత్రలు చేయువానికి బ్రహ్మాదిదేవతలందఱు కోరినవాని నిత్తురు. దివ్యదేశయాత్రకొఱకు చని విధివశముచేత మార్గమునందు మృతిజెందెనేని వాఁడు స్వర్గము నొందును. సన్న్యాసులను, యాత్ర చేయువారిని దేవతలందఱు కాపాడుదురు. విశేషముగా విష్ణుగణములేవారిని రక్షిం తురు. మృతిజెందవలయుననియే పుణ్యక్షేత్రములయందు చిరకాలము వసించి కొంత పాపముచే వేఱొకస్థలమందు గతించినట్టులయినవాఁడు మఱుజన్మమునందు కావేరీ తీరమందు వైదిక బ్రాహ్మణకులమందు సకల శాస్త్ర సంపన్నుఁడై సదాచారముగల వాఁడై, భగవద్భాగవతాచార్య భక్తిగలవాఁడై జనించి, అంతమందు సద్గతిచెందును. పలాని క్షేత్రముబోయి యచ్చట మృతిజెందుదుననియు, దానియందు చావకమఱలననియు, ధర్మస్వరూపులును నాల్గువేదములును ఎఱింగినవారలునైన బ్రాహ్మణుల సన్నిధియందు సంకల్పము చేసికొని పోయినవాఁడు మఱల నింటికి వచ్చెనేని వాఁడు మహాపాపి యగును. వాఁడును ప్రాయశ్చిత్తము చేసికొనవలయును. మరణకాలము సమీపించి నదని యెఱింగి విష్ణుక్షేత్రములయందు చావవలయునని యెవ్వఁడు నడచునో ? వాఁడునడచు అడుగులకన్నియు అడుగొక్కటికి యొక గోదానఫలమును పొందును. ఏకారణముచేతనైనను మఱలివచ్చెనేని అడుగొక్కటికి యొక గోవును చంపినదోష

మును పొందును. గృహమునందొకఁడుచేసిన పాపములు పుణ్యదేశములయందు భగవద్భాగవత సేవచేతను తీర్థప్రసాదములచేతను నివర్తియగును. క్షేత్రములయందు చేయుపాపము దేనిచేతను నివర్తిగానేరదు.

గరుడా! అన్యునికి సహాయము చేయుటకంటెను తనయొక్క తల్లిదండ్రులకును, తోబుట్టువారికిని నలయువానినిచ్చిన విశేషమగును. పుత్రుఁడు తండ్రికి ధనము మొదలగు వానినిచ్చెనేని, యుత్తమబ్రాహ్మణునికి యిచ్చిన పుణ్యముకంటె నూఱుపాళ్లధిక పుణ్యము గలుగును. తల్లికి యిచ్చెనేని కోయిపాళ్లధిక పుణ్యము నొందును. సహోదరికి యిచ్చెనేని లక్షపాళ్లు అధిక్యము చెందును. సహోదరునకిచ్చెనేని పుణ్యమునకు మితములేదు.. కష్టపడి తాను సంపాదించిన ద్రవ్యమును సన్మార్గమునందు సెలవుచేయవలయును. ఎవ్వఁడు మరణమును మఱచి, శరీరమును పోషించి, వస్త్రభూషణాదులచే నలంకరించి, సంసారసాగరమునందు మునుఁగుచున్నాఁడో? వానిజూచి ఈజీవుని సామర్థ్యమింతయ్యేగదా? మనుష్యజన్మమునొందియు కర్మముచేత వీఁడు మనచేతబడినవాఁడే యయ్యెనని యముఁడు పరిహసించును. ఒక్కతె పరపురుషునిగూడి కనినబిడ్డను దాని పురుషుఁడు యెత్తితొడయందిడి ముద్దాడుచుండగా, ఈబిడ్డను గన్నవాఁడు వీఁడా? నన్నుగూడి కన్నవాఁడు వేఱొక్కఁడుండగా దానిదెలియక వీఁడే కనినట్లు ముద్దాడుచున్నాఁడేయని తలంచి, మగడును తాను బిడ్డను ముద్దాడుటజూచి నవ్వుచున్నదియని తన్ను తలంచునట్లు పెదవులు విరిచి నవ్వునట్టి కృత్రిమ భార్యవలె భూదేవి మితిలేని భూమియు, మితిలేని ద్రవ్యమునుపొందియు, తాను మంచివస్త్రములను గట్టకయు, మంచి పదార్థములు భుజింపకయు, యితరులకివ్వకయు ధనముగూడబెట్టునట్టి మూఢునిజూచి వీనికే నేను సతముగాదనితలంపక నాదినాదియనుచున్నాఁడని నవ్వుచుండును. భూమియును తక్కిన ధనమును ఒక్కనికే స్వంతమగునా? మనదిమనదియనిచెప్పి తిలుగువారందఱు అంతమునందు విడచిపోవుచున్నారని, సన్మార్గమునందు నడచి జీవులకుపకారముచేయుచు, భూదానము చేయువానిని, భూదేవిమనల నేలువాఁడు రెూగ్యుఁడు వానిచే మనము సద్బ్రాహ్మణునిచే నివ్వఁబడితిమేయని సంతోషించుచున్నది. భూదానముచేసినవాఁడును జలమందు మునిగినవాఁడైనను, పంచాగ్నిమధ్యమందుండైనను, తపస్సుచేసినవాఁడును, యాగములు చేసినవాఁడును, యుద్ధమునందు పిఱుతివియక ముందు నిలుచువాఁడును, ఇహపరములయందు మేలుచెందుదురని చెప్పెను.

ఇరువదినాలుగవ యధ్యాయము
సమాప్తము.

## ఇరువదియైదవ యధ్యాయము.

సూతమహాముని ఋషులనుజూచి తపోనిధులారా! గరుడుఁడు శ్రీమన్నా రాయణునిజూచి వాసుదేవా! నిత్యశ్రాద్ధము ఏవిధముగా చేయదగినది? అనియడుగఁగా, భగవంతుడు ఖగేశా! ప్రతిదినమును ఒక బ్రాహ్మణునకు భోజనము బెట్టి యొక ఘటమందు అన్నమును, జలమును నిండించి దాని నాబ్రాహ్మణునకు దానము చేయవల్లయును. ఈనిత్యశ్రాద్ధముచేత, మృతినొందెన జీవుఁడు సుఖముఁనొందును. ఆజీవుని యొక సంవత్సర పర్యంతముత్రోవనడిపించుకొని యమలోకము బోవుదూతలును ఆశ్రాద్ధముచేత తృప్తినొంది, యాజీవునికి మేలుచేయుదురు. గతించిన పండ్రెండవ దినము సంకల్ప పూర్వకము గా పండ్రెండు ఘటములు దానము చేయవలయును. దరిద్రుఁడైనను శ్రీమహావిష్ణువును గుఱించి యొక పెద్దఘటమును, ధర్మరాజునుగుఱించి యొక ఘటమును, చిత్రగుప్తుని గుఱించి యొక ఘటమును దానము చేయవలయునని చెప్పెను. గరుడుఁడు భగవంతునిజూచి స్వామీ! మోక్షమును, స్వర్గమును ఏక్షేత్రమునందు గతించిన గలుగును? ఆమోక్షస్వర్గములు రెండును ఏకర్మము చేసినట్లులయిన కలుగును చెప్పి, కటాక్షింపవలయుననఁగా, వైకుంఠుఁడు, వైనతేయుఁడా! ముక్తిస్థలములగు అయోధ్యా, మధుర, మాయా, కాశి, కాంచి, అవంతికాపురి, ద్వారవతియనెడు సప్తపురములలోపల దేనియందైనను మృతినొందువాఁడు మోక్షము నొందును. సన్యాసాశ్రమమునొంది, మృతినొందువాఁడును విష్ణుభక్తిచేసి మృతినొందువాఁడును, భగవన్నామము నుచ్చరించుచు ప్రాణములు విడచువాఁడును, సాలగ్రామముండుచోట మరణము నొందువాఁడును ముక్తిచెందుదురు. తులసీవనమును పెంచువాఁడును దానికి నీళ్లుపాయువాఁడును పాపములు తొలఁగి సద్గతినొందుదురు. గోవునకును, బ్రాహ్మణునకును, శిశువునకును, ఆపదవచ్చినపుడు తన ప్రాణము విడచియయినను వానిని యెవఁడు రక్షించునో? వాఁడు అంతమునందు దేవతలందఱు గుఱ్ఱాని పిలువగా స్వర్గలోకమునకుపోవును. శ్రీరంగమునందైనను, కాశియందైనను, కురుక్షేత్రమందైనను, భృగుక్షేత్రమందయినను, ప్రభాసతీర్థమందైనను, కాంచీపురమందయినను, పుష్కరతీర్థమందయినను, భూతేశ్వరమందయినను మృతినొందినవాఁడు ముక్తి నొందును. ఏఁడులేక ఎనిమిదియేండ్లవయసు కలిగిన కన్యను వివాహమయినవాఁడును, వేదశాస్త్రములను తెలిసినవాఁడును, కన్యాదాన భూదాన గృహదాన గోదానములను చేసినవాఁడును, తిలపర్వతమునైనను, ఏనుఁగునైనను దానము చేసినవాఁడును స్వర్గము నొందుదురు. బావియయినను, నడబావియయినను, తటాకమునైనను, దేవాలయమునైనను బాగుపఱచువాఁడు పూర్వము దాని ప్రతిష్టచేసినవానికంటె నధికపుణ్యము

నొంది, స్వర్గము చేరును. దగ్ధచేతనయినను ఇల్లుగట్టి దానము చేయువాఁడు మూడున్నరకోటి సంవత్సరములు స్వర్గవాసము చేయును. బ్రాహ్మణులకు వర్షాశనము నిచ్చువాఁడును, స్వర్గము నొందునని వక్కాణించెను.

ఇరువదియయిదవ యధ్యాయము
సమాప్తము.

## ఇరువదియాఱవ యధ్యాయము.

---

సూతుఁడు మహాఋషులారా! అనంతరము గరుడుఁడు లోకనాథునిజూచి స్వామీ! ఆశౌచమెట్టిది? దాని నాకు జెప్పవలయుననఁగా, ఆదిదేవుండైన భగవంతుడు గరుడా! బ్రాహ్మణునికి పుత్రుఁడు పుట్టినను, బ్రాహ్మణుఁడు మృతినొందినను దాయాదులకు పదిదినములవఱకు ఆశౌచముగలదు. ఆశౌచముగలవారు దేవతారాధనము, హోమము మొదలగునవి చేయుటకూడదు. ఆశౌచముగలవారి గృహమునందు అదితీఱునంతవఱకు ఎవ్వరును భుజింపఁగూడదు. అగ్నియందుపడి చచ్చినవానికిని, సింహము మొదలగు మృగములచేత నాశము నొందినవానికిని, దేశాంతరమందు నీల్గిన వానికిని తోడనే కర్మము చేయఁగూడమిచేత, కర్మముచేయ నారంభించు దినము మొదలు ఆశౌచముగలుగును. మృతినొందెనని వినగానే స్నానము మాత్రము చేయవలయును. పృథ్వీశునకును, తపము చేయు బ్రాహ్మణునికిని, యాగముచేయు బ్రాహ్మణునికిని, వారి దాయాదులలో నెవ్వరేని గతించినట్టులయిన ఆశౌచములేదు. కన్నతల్లికి మాత్రము పదిదినము లాశౌచముగలదనుటయు, తండ్రికి స్నానము మాత్రము చాలుననుటయు కొందఱి యభిప్రాయము. పెండ్లి కుమారుఁడైయుండునపుడును, యాగముచేయుకాలమందును, ఉత్సవమునకై కంకణము ధరించియుండుకాలమందును ఆశౌచము సంభవించెనేని యాయాశౌచము ఆకార్యములయందుండువారికి ఆకాలములయందు కలుగనేరదు. ఒక ఆశౌచము కలిగియుండునపుడు నడుమ వేఱొక యాశౌచము కలిగెనేని ముందువచ్చిన యాశౌచములోనే వెనుక వచ్చిన యాశౌచము దాయాదులకు నివర్తియగును. ఆశౌచము కలుగుటకు పూర్వము బ్రాహ్మణుల కివ్వదలచిన దానిని యాశౌచము కలిగిన తర్వాతను ఇవ్వనగును. బ్రాహ్మణులును గ్రహింపనగును. గోవులను, బ్రాహ్మణులను, స్త్రీలను రక్షించు విషయమునందును, యుద్ధభూమియందును ఒకఁడు

మృతినొందనేని వానితో చేరినవారికి యొకదినము మాత్రము అశౌచముగలదు. స్నానము మాత్రము చాలుననుట కొందఱి యభిప్రాయము అని వక్కాణించెను.

ఇరువదియాఱవ యధ్యాయము

సమాప్తము.

---

## ఇరువదియేడవ యధ్యాయము.

సూతమహాముని ఋషులారా! గరుడుఁడు మాధవునిజూచి దుర్మరణము నొందినవాఁడే గతిచెందును? వానికి యేవిధముగా కర్మము చేయదగినదియనఁగా, లక్ష్మీనాయకుండు, గరుడా! కాలుజారిపడియైనను, ఉరివేసికొనియైనను, విషము దినియయినను, అగ్నియందుపడియయినను, రవణూజుకొని త్రాగియయినను మృతినొందినవాఁడును, పక్షియొక్క ముక్కుచేతనయినను, ఎద్దుకుమ్మియయినను నీటబడియయినను, కుక్కనక్కలు కఱచియయినను, కుష్ఠరోగముచేతనయినను, దేహమందు పురుగులు కలిగియయినను చచ్చినవాఁడును, బ్రాహ్మణులచేనైనను, యవనులచేనయినను, మ్లేచ్ఛులచేనయినను, చండాలురచేనయినను కొట్టఁబడి మృతినొందినవాఁడును, పిడుగుపడియయినను, చెట్టుపడియయినను, చచ్చినవాఁడును, శూద్రస్త్రీని యయినను చాకలదానినైనను తాకి స్నానము చేయక గతించినవాఁడును సద్గతి నొందక నరకము నొందుదురు. అట్లు మృతినొందినవారిని జేరినవారికి యాశౌచము లేదు. వారలుతోడనే కర్మము చేయవలసినదియు లేదు. నారాయణబలిచేసిన వెనుక కర్మము చేయనగును. దుర్మరణము నొందినవాఁడు బ్రాహ్మణుండైనట్టులయిన యాఱు మాసములకు తర్వాతను, క్షత్రియుండౌరయేని రెండు మాసములకు తర్వాతను, వైశ్యుఁడయ్యేనేని పదియేనుదినములకు తర్వాతను, శూద్రుఁడగునేని గతించినలోఁడను కర్మము చేయదగినది. గంగాతీరమందైనను, యమునాతీరమందైనను, నైమిశారణ్యమందైనను, పుష్కరక్షేత్రమందైనను, తటాకతీరమందయినను, అశ్వత్థవృక్షము క్రిందనయినను, పశువుల కొట్టమందైనను, గృహమందయినను నారాయణబలి చేయవలయును. వేదమంత్రములచేత శ్రీమహావిష్ణువును పూజించి, స్తోత్రముచేసి దక్షిణాముఖముగానిలిచి, శంఖుచక్ర పీతాంబరధరుఁడును, నిత్యుఁడును, సర్వాంతర్యామియును, దివ్యమంగళ విగ్రహుండును, అనంతకల్యాణగుణ స్వరూపుఁడునై ప్రకాశించెడు భగవంతుఁడా! మృతిజెందినవానికి సద్గతి గలుగజేయవలయునని యాభగవంతుని

ప్రార్థించి, ధ్యానముచేసి, భక్తిపూర్వకముగా బ్రాహ్మణులను భోజనము చేయించి, ధాన్యదానముచేసి, పిండతర్పణములు మొదలగునవి చేయవలయును. అట్లుచేసిన మఱునాడు సువర్ణముచేత విష్ణుప్రతిమ యొకటియును, తామ్రముచేత రుద్రప్రతిమ యొకటియును, వెండిచేత బ్రహ్మయొక్క ప్రతిమయొకటియును, ఇనుముచేత యమ ప్రతిమ యొకటియునుచేసి, పశ్చిమమున విష్ణువును, తూర్పున బ్రహ్మను, దక్షిణమున యముని, ఉత్తరమున రుద్రుని, నడుమమృతినొందినవానినుంచి పూజించి, ఐదుకలశ ములుంచి వానియందు నవరత్నములువేసి, యజ్ఞోపవీతము మొదలగు వానిచే నలంక రించి పైజెప్పిన యైదుదేవతలను గుఱించి శ్రాద్ధముచేసి, పిండమువేసి, ఎనిమిది దాన ములునుచేసి, తామ్రపాత్రయందు నువ్వులనుబోసి హిరణ్య సహితముగా దానము చేసి, ఋగ్వేదము తెలిసినవారికి ఫలించియుండు పైరుతోడ భూదానమును, యజు ర్వేదము అధ్యయనముచేసినవారికి దూడసహితముగా గోదానమును, సామవేదులకు సంబావు బియ్యమును దానము చేయవలయును. మున్నూటయఱువది మోదుగాకుల కాఁడలతో మృతినొందినవాని, దేహమువంటిది యొకటి చేయవలయును.

గరుడా! మున్నూటయఱువది కాఁడలకు వివరముదెలిపెదవినుము. శిరమునకు నలువదియును, కంఠమునకు పదియును, రొమ్మునకు యిరువదియు, ఉదరమున కిరువ దియు, రెండుచేతులకు నూఱును, నడుమునకు యిరువదియు, తొడలకు నూఱును, మోకాళ్లకు ముప్పదియు, శిశ్నమునకు నాలుగును, వృషణములకాఱును, కాళ్లకు పదియును జేర్చి, మఱల శిరమునకు టెంకాయయు, ముఖమునకు పంచరత్నములును, నోటికి యరటిపండును, నాసికకు తిలపుష్పమును, చెవులకు నువ్వులును, నరములకు తామరతూండ్లును, మాంసమునకు అన్నమును, రక్తమునకు తేనెయును, వెంట్రుక లకు సవరపు వెంట్రుకలును, చర్మమునకు కృష్ణాజనమును, స్తనప్రదేశమునకు గురిగిం జయు, నాభికి తామరపుష్పమును, వృషణమునకు తాటికాయయును ఉంచి చందన పుష్పములచేత నలంకరించి, శాస్త్రప్రకారము కర్మము చేయవలెయును. ఈవిధ ముగా చేయఁగా దుర్మరణము నొందినవాఁడు సద్గతి నొందును. ఇట్లు కర్మము చేయు పుత్రునకు పదిదినములును, తక్కిన దాయాదులకు మూఁడు దినములును ఆశౌ చముగలదని చెప్పెను.

ఇరువదియేఁడవ యధ్యాయము

సమాప్తము.

## ఇరువదియేనిమిదియవ యధ్యాయము.

సూతమహాముని నైమిశారణ్యవాసులారా! తర్వాత భగవంతుఁడు వైనతేయా! వృషోత్సర్జనమును గురించి మఱియొక విధమును జెప్పుచున్నాను. పూర్వము చెప్పిన దినములలో నొకదినమందు స్థలశుద్ధిచేసిన తర్వాత నగ్నిని ప్రతిష్ఠచేసి ఏకచ్ఛాయగలిగిన కోడెదూడ యొకటియు, దానికి చిన్నదియగు ఆవుదూడ యొకటియు తీసికొనివచ్చి యారెంటిని స్నానము చేయించి, వస్త్రాభరణములచే నలంకరించి, లోకయందు తర్పణముచేసి, విడచి, విడచి నాందీశ్రాద్ధముచేసి, యొకపక్షము వఱకు బ్రాహ్మణులకు భోజనము పెట్టించి, వెండి, తిలలు, ఉదకకుంభము, వస్త్రము మొదలగు వానిని దానము చేసినట్టులయిన నూటయొక్కతరము వారు స్వర్గము చేరుదురు. దీనిని కామ్య వృషోత్సర్జనమని చెప్పుదురు అని వక్కాణించెను.

ఇరువదియేనిమిదియవ యధ్యాయము

సమాప్తము.

---

## ఇరువదితొమ్మిదియవ యధ్యాయము.

---

వ్యాసశిష్యుండగు సూతుఁడు ఋషులారా! పురుషోత్తముండు వైనతేయా! జీవుఁడు సుఖమును, దుఃఖమును పొందుటకు వాఁడుచేసిన సత్కర్మ దుష్కర్మములే కారణములగును. జీవులనేకులుండఁగా నొక జన్మమందు ఒక జీవునిచేత చేయఁబడిన కర్మము తను జేసినవాఁడు పలానివాఁడని తెలిసి యేప్రకారము మఱుజన్మమునందు వాని జెందునని సందేహింపకుము. ఒకస్థలమందు పశువులు అనేకములుండఁగా దూడ తను గన్నయావును తెలిసి దానినే చేరునట్లు కర్మము తను జేసినవానినే తప్పక చేరును. భూదానముకంటె యుత్తమదానమును, సత్యవాక్యముకంటె మేలైన పుణ్యమును లేదు. అసత్యము చెప్పుటకంటెను, తప్పు పత్రములు వ్రాయుటకంటెను అధిక పాపము లేదు. భూమి భగవంతునికి సంబంధించినది యగుటచేతను, గోవులు సూర్యునియొక్క కుమార్తెలగుటచేతను, స్వర్ణము అగ్నియొక్క కుమారుఁడగుటచేతను, ఆమూఁటిని దానము చేయువాఁడు మూఁడులోకములకు నాయకుఁడగును. ఒక గోవుయొక్క చర్మప్రమాణము భూమినిదానము చేసినట్టులయినను

వాఁడు మహాపాతకములనుండి నివర్తియగును. భూదానముచేసి, నులల నాశచేత నాభూమిని అపహరించుటకు యత్నించినవాఁడును, దానముచేసిన భూమి యొక్క ఫలమును దానము తీసినవానిచెందక చేసినవాఁడును, దానము చేసిన భూమిపైని యొకఁడు వ్యాజ్యమాడెనేని దానము తీసినవానికి సహాయముచేయని వాఁడును ప్రళయకాలమువఱకు నరకవాసము చేయుదురు. ఒకనియొక్క జీవనము చెఱచినవాఁడు వేయి గోహత్యలు చేసిన పాపము ననుభవించును. ఒకనికి జీవనము కలుగజేసినవాఁడు లక్ష గోదానములఫలము నొందును. నూఱుగోదానములు చేయుటకంటెను ఒక గోవును కొట్టకుండుటయును, దొంగలింపకుండుటయును మిక్కిలి మేలగును. ఒకఁడు ఒక గోవును జంపి నూఱు గోదానములు చేసినను చంపిన పాపమే మేలగును. మిక్కిలి శీలుఁడును, నాలుగు వేదముల నధ్యయనము చేసిన వాఁడునైన యొక యుత్తమ బ్రాహ్మణుని యుపచరించి గృహకృత్యములయందు వానికి దక్కువలేక యుండునట్లు కావలసిన వానినిచ్చుట, యశ్వమేధము చేయుట కంటెను మిక్కిలి విశేషమగును. యాగము చేయుటచేత దేవతలును, బ్రాహ్మణులును సంతోషించుచున్నారు. రాజు బ్రాహ్మణులయొక్క ద్రవ్యము నపహరించి, చతురంగసైన్యమునుచేర్చి యుద్ధము చేసెనేని యాసైన్యము యుద్ధభూమియందు ఒక్కటిగా నశించును. తన చేతనైనను తన పూర్వులచేతనయినను బ్రాహ్మణునకు ఇవ్వఁబడిన ద్రవ్యము నపహరించుటకూడదు. దాని నపహరించినవాఁడు అఱువది వేల యేండ్లు మలమందు పురుగైబుట్టును. ధనాపేక్షచేత కృత్రిమ స్నేహముజేసి, బ్రాహ్మణుల ద్రవ్యము నపహరించినవాఁడు చిరకాలము నరకమునందు వసించును. లోకమునందు విషమునైనను జీర్ణించుకొననచ్చునుగాని విప్రస్వము జీర్ణించుకొనుట మిక్కిలి కష్టము. దేవతాద్రవ్యము నపహరించినను, బ్రాహ్మణులసొమ్ము నపహరించి నను, వారిని యవమానించినను కులము నాశము నొందును. శాస్త్రజ్ఞానమును, సదాచారమునుగల యుత్తమ బ్రాహ్మణుని ఆరాధించి, యాశాస్త్రజ్ఞానము కొంతయయి నను లేనివాని అవమానించినను దోషము లేదు. సద్బ్రాహ్మణునకిచ్చుట యగ్నియం దాహుతిచేయుటకు సమానమగును. తక్కినవారికి చేసినదానము బూదిలోజేసిన హోమమునకు సామ్యమగును. సంక్రమణ పుణ్యకాలములయందు దానములు చేసినట్టు లయిన, వానిని సూర్యుఁడు కొఱఁతలేక వృద్ధిచేయును. బ్రాహ్మణులకుదగిన షట్కర్మ ములయందు అధ్యయనము చేయించుటయు, యాగము చేయించుటయు, దానము తీయుటయునైన మూఁడు కర్మములయందు దానము తీయుటచేత మిక్కిలి దోషము లేదు. దానము తీయుటచేత కలుగు పాపము వారలు చేయు స్నానజపములచేత నివర్తియగును. తక్కిన రెంటిచేతను వచ్చు పాపము నివర్తియగుట యరుదు. ఆచార

ష్యుత్పుండి తొలఁగకయు, పరాన్నము భుజింపకయు, సుంధము బ్రాహ్మణుఁడు సముద్రముచేత కొట్టఁబడిన భూమియంతయు దానము తీసికొను వాఁడు దోషమునకు లోబడక దానము చేసినవానికిని విశేష ఫలమును కలుగఁజేయుననిచెప్పి, మఱియు జెప్పుచున్నాఁడు.

ఇరువదితొమ్మిదియవ యధ్యాయము

సమాప్తము.

---

## ముప్పదియవ యధ్యాయము.

---

సూతపౌరాణికుండు హే వైదిక శ్రేష్ఠులారా ! వాసుదేవుండు వినతాపుత్రుని జూచి గరుడా ! నాలుగేండ్లకు తర్వాత పంద్రెండేండ్ల వయస్సునకులోపల బిడ్డలు చేయు పాపము తల్లిదండ్రులను చేరును. తల్లిదండ్రులు లేనియెడల ఆబిడ్డలను రక్షించువారిని జేరును. ఆపాపమునకై వారు ప్రాయశ్చిత్తము చేసికొనవలయును. బిడ్డలకు పాపము లేదు. బిడ్డలను రాజు శిక్షింపగూడదు. అదియట్లుండ వ్యాధిచేత పీడింపఁబడి స్నానము చేయ శక్తిలేనివానికి యాశౌచము కలిగెనేని యాశౌచము లేనివాడొక్కఁడు పదిమాఱులు స్నానముచేసి యొకతూరి వానిని తాకి ఈరీతిగా పదిమాఱులు చేసినట్టులయినవాఁడు శుద్ధుఁడగును. భగవంతుఁడు లేడని వదరువాఁడెవఁడో ? వాఁడు మహాపాపియగును. వానికిని, దుర్మరణము నొందినవానికిని యుత్తరక్రియలు చేయవలసినదిలేదు. అట్లు చచ్చినవాఁడు యాగము చేసినవాఁడగునేని అగ్నిని నీటియందును, ఔపాసనమును నాలుగు సంధులయందును, పాత్రలు నిప్పులోను పాఱవేయవలయును. తర్వాత సంవత్సరాంతమునందు దయగలిగిన పుత్రుఁడు శుక్లపక్ష యేకాదశియందు శ్రీవిష్ణువును, యముని ఆరాధించి మృతినొందినవానిగురించి పదిపిండములువేసి వానిని యెత్తుకొనిపోయి నీటియందువేసి దక్షిణముఖముగా నిలిచి మృతినొందినవాని నామమును మూఁడుమాఱులు గట్టిగా చెప్పుచు, స్నానముచేసి, యింటికి వచ్చి, యుపవాసము చేసి, మఱునాడు వేదశాస్త్రజ్ఞులగు ఏడు, లేక తొమ్మిది బ్రాహ్మణులను వరించి మధ్యాహ్నకాలమునందు ఉత్తరముఖముగా వారిని యాసనమునందునిచి, యారాధించి, పీతాంబరధారియగు భగవంతుని పూజించి యాబ్రాహ్మణులను శోభనమునిడి బ్రహ్మవిష్ణు మహేశ్వరులకును, దూతల సహితముగా యమునికిని, మృతినొందిన వానికిని క్రమముగా నైదుపిండములువేసి, మృతినొందిన వానియొక్క పేరును గోత్ర

మునకు చెప్పి శ్రీవిష్ణునామముల నుచ్చరించి మృతినొందినవాఁడు పితృదేవతలతో చేరమిచేత వానియొక్క రైమిదపపిండమును ఎత్తివేసి, తర్వాత నమస్కారముచేసి, దానములుచేసి, పైజెప్పిన బ్రాహ్మణులయందు ప్రేతస్థానమందుండు వానికి యధికముగా దక్షిణయిచ్చి భగవంతుఁడు తృప్తినొంది కటాక్షింపవలయునని ప్రార్థించి బ్రాహ్మణులకు ప్రదక్షిణ నమస్కారములుచేసి తర్వాత దక్షిణముఖముగానుండి తర్పణము చేయవలయును. మఱియు విశేషముగా చేయవలయునని పుత్రునికి యిచ్చు [redacted]డనేని, స్వర్ణముచేత సర్వమునుచేసి శాస్త్రీయముగానన్నియు చేయవచ్చునని చెప్పి మఱియు సంవత్సర శ్రాద్ధముచేయు రీతిని చెప్పుచున్నాఁడు.

ముప్పదియవ యధ్యాయము

సమాప్తము.

## ముప్పదియొకటియవ యధ్యాయము.

సూతుఁడు విష్ణుభక్తులారా! భగవంతుండు పక్షిరాజునుజూచి గరుడా! పుత్రులు మొదలగు వారు తల్లిదండ్రులు మొదలగు వారిని గుఱించి ప్రతిసంవత్సరమును శ్రాద్ధము చేయవలయును. తండ్రి తన కుమారునికిని, జ్యేష్ఠుఁడు తన తమ్మునికిని, శ్రాద్ధము జేయునట్లు కూడెనేని తమ తరమందుగల వారిని యుద్దేశింపక మృతినొందినవానిగుఱించి మాత్రము చేయవలయును. పుత్రుఁడు తల్లిదండ్రులకు చేయునేని మూడు తరములవారిని యుద్దేశించియే చేయవలయును. ఆశౌచము, వృద్ధిమొదలగునవి కలిగనేని యవి తీఱిన దినమందు శ్రాద్ధము చేయవలయును. మృతినొందినవానికి కర్మము చేయునప్పుడే సపిండీకరణముచేయక, మాసికము మాత్రము చేయుచువచ్చునపుడు ఆశౌచముకలిగి మాసికము నిలుపబడెనేని యామాసికమును మఱుమాసికముతోచేర్చి చేయవలయును. సపిండీకరణముచేసి, మాసికము చేయుచు నచ్చెనేని యాశౌచముచేత నిలిచిన మాసికమును ఆయాశౌచము తీఱినదినమునందు చేయవచ్చును. ఉపవీతుఁడుగాని పుత్రుఁడు శ్రాద్ధము చేయునట్లుకూడెనేని సంకల్పవిధానముగా చేయవలయును. ఏకకాలమందు దేశాంతరమునందనేకులు గతించిరియని వినినట్టులయిన మొట్టమొదట నెవ్వఁడు గతించెనని వినఁబడెనో వానికి మొదట కర్మము చేసి తర్వాత తక్కినవారికి కర్మము చేయవలయును. మృతదినము తెలియక మృతవార్తమాత్రము తెలిసెనేని అమావాస్యయందు కర్మము చేయవలయును. దినము

తెలిసి మాసము తెలియని పక్షమునందు ఆషాఢము, భాద్రపదము, మార్గశిరము, మాఘము ఈమాసములయందు కృష్ణపక్షాష్టమియందయినను, అమావాస్యయందయినను చేయనగును. దేశాంతరమునందు ఒకఁడు మృతినొందినదినముగాని, మాసముగాని తెలియకుండిన యాత్రార్థమువాఁడు బయలుదేఱిన తిథియందు చేయవలయును. ఒక కుటుంబమునకు యజమానుఁడు వానితోఁ చేరిన కొందఱితోఁ దేశాంతరము పోయి నప్పుడు వారియందొకఁడు మృతినొంది, ఆయజమానుఁడు అక్కడ ఆశౌచమును అనుష్ఠించి, పిమ్మట యింటికి వచ్చినట్టయితే ఆకాలమందు ఇంటియందుండిన పుత్రుఁడు వేఱొకరికి శ్రాద్ధము చేయుచుండఁగా నాయజమానుఁడు శ్రాద్ధము చేసి ముగియునంత వఱకు దూరముగానుండి తర్వాత రావలయును. శ్రాద్ధమునకు వరింపఁబడిన బ్రాహ్మణుఁడు పైఁజెప్పిన సమాచారమును పూర్వమే తెలిసి దానిని శ్రాద్ధముచేయు పుత్రునకు జెప్పక శ్రాద్ధము భుజించెనేని దోషము ఆబ్రాహ్మణుని చెందును. తల్లిదండ్రులు గతించిన తిథి మఱచెనేని అష్టమియందైనను, ఏకాదశియందైనను, అమావాస్య యందైనను శ్రాద్ధము చేయవలయును. చేయక విడువగూడదు. శ్రాద్ధముచేయక విడచు నట్టివాఁడెవఁడో? వాఁడే చండాలుఁడగును. ఒకఁడు మరణము నొందువఱకు ప్రతి దినమును నిత్యశ్రాద్ధము చేసికొనునేని వానికి మిగుల క్షేమము కలుగును. మృతినొంది వానిగుఱించియే గాక బ్రతికియుండువాఁడు తన క్షేమము కొఱకు చేయదగినదియయిన యీనిత్యశ్రాద్ధమునకు విధియేదియులేదు. ఆవాహనమునులేదు. భుజించునట్టి బ్రాహ్మణునకును నిర్బంధమయినవిధి యేదియునులేదు. ప్రతిదినమును ఒక బ్రాహ్మణునకు బోజనమిడుట మాత్రమే చాలును అని చెప్పెను.

ముప్పదియొకటియవ యధ్యాయము
సమాప్తము.

## ముప్పదిరెండవ యధ్యాయము.

వేదవ్యాస మహర్షియొక్క శిష్యుండగు సూతుఁడు మహాఋషులారా! గరుడుఁడు మాధవునిజూచి స్వామీ! లోకమందుగల జీవులలో నెవ్వఁడెవ్వఁడే యేపాపములఁ జేసెనో, ఎవ్వఁడెవ్వఁడే యేపుణ్యములఁజేసెనో వానిని విశదముగా దెలియ నగునా? పాపము జేసినవాని దండించుటకు యముఁడు వినా మఱియెవ్వరునులేరా? చెప్పి కటాక్షింపవలయుననఁగా భక్తవత్సలుండు గరుడా! ఈజీవుఁడీ పాపము జేసె

నని చక్కఁగా దెలియనగును. శిష్టుఁడగువాఁడు తప్పి పాపము చేసెనేని వాని వాని యొక్క యాచార్యుఁడు శిక్షించును. దుష్టుఁడు ఆచార్యుని యాజ్ఞకును అణఁగఁడు గనుక వాని రాజు దండించును. దుష్టుఁడైనను శిష్టుఁడైనను ఎవ్వరెఱుఁగక పాపము చేయునేని యముఁడు వానిని చక్కఁగాదండించును. పాపము చేసినవాఁడు ఆపాపనివృత్తి కొఱకు ప్రాయశ్చిత్తము చేసికొనక మృతినొందెనేని వాఁడు యమ లోకమునందు చిరకాలము నరకవాసముచేసి, కుక్కనక్క మొదలగు నీచజన్మముల నొ[illegible] పిమ్మట మనుష్యజన్మము నొంది, ముందు జన్మమందుజేసిన పాపమును ఎల్లవా రెఱుంగునట్టి, గుఱుతుగలవాఁడగును. మాటలాడుటకు శక్తిలేక గొంతడపుగలవాని పూర్వజన్మమునందు అబద్ధమాడి, నరకవాసము చేసినవాఁడనియు, మూగను గోవు లను బాధించినవాఁడనియు, ఇతరులయింటిని కాల్చినవాఁడనియు, కుష్ఠరోగిని బ్రహ్మ హత్య చేసినవాఁడనియు, పుచ్చిన దంతములుగలవాని మద్యపానముచేసినవాఁడనియు, పుచ్చిన గోళ్లుగలవాని స్వర్ణస్థేయియనియు, వికార శరీరముగలవాని గురుతల్పకుఁ డనియు, చండాలజన్మము నొందినవాని స్వజాతి పరస్త్రీని గూడినవాఁడనియు, దరి ద్రుని ఒక్కరికిని ఒక్కటిని యివ్వనివాఁడనియు తెలియుము.

గరుడా! అపరిశుద్ధునకును, అసత్పాత్రునకును పురోహితుఁడుగా నుండిన వాఁడు సూకరజన్మము నొందును. ఒక గ్రామమునకు పురోహితులనేకులుండిరేని పాపమంతయు ఒక్కనిజేరక పురోహితులందఱిని జేరును. అట్లుగాక ఒక గ్రామ మునకు పురోహితుఁడొక్కఁడే యుండిన పాపమంతయు వానినే చేరును. ఆపురో హితుఁడు గార్దభజన్మము నొందును. స్నానమును, సంధ్యావందనమును, దేవతారా ధనమును చేయక భుజించినవాఁడు వాయసజన్మము నొందును. ఇల్లు, లేక పందిలి మొదలగు స్థలములుగాక బట్టబయలునందు గూర్చుండి భుజించినవాఁడు మనుష్య సంచారములేని యరణ్యమునందు వానరజన్మము నొందును. ఎవ్వరును భయపడదగిన కఠినవాక్యములాడువాఁడు మార్జాలజన్మము నొందును. వృక్షములను గాల్చినవాఁడు మిడుఁగుఱుఁ బురుగుజన్మము నొందును. బ్రాహ్మణులకు చెడు పదార్థములను దానము చేసినవాఁడును, శూద్రస్త్రీనిగూడిన బ్రాహ్మణుఁడును బండ్లను లాఁగు ఎద్దుజన్మము నొందుదురు. బ్రాహ్మణునకు చలిదియన్నమిడినవాడు నల్లకోతిజన్మము నొందును. కారణములేక నెల్లవారిని విరోధించువాఁడు గరుడపక్షిజన్మము నొందును. పుస్తక మును దొంగలించినవాఁడు పుట్టిన తర్వాత కొంతకాలమునకు గుడ్డివాఁడగును. బ్రాహ్మణకుటుంబమును నాశము చేసినవాఁడు తనకు పుట్టిన బిడ్డలనందఱిని బోగొట్టు కొనును. క్షుత్తుచేత నన్నమడిగినవానికి యన్నమిడని వాఁడు బిడ్డలులేని పాపియగును.

వస్త్రము దొంగలించినవాఁడు ఉడుము జన్మము నొందును. ఇతరులకు విషముబెట్టిన వాఁడు సర్పముయి పుట్టును. సన్యాసాశ్రమము నొందినవాని భార్యను గూడినవాఁడు పిశాచ జన్మము నొందును. తక్కిన యన్యస్త్రీలను గూడువాఁడు అల్పాయువగును. గురుభార్యను పొంద గోరువాఁడు తొండజన్మము నొందును. తనకంటె నీచమయిన జాతి స్త్రీని గూడినవాఁడు ఏఁచుకుక్కయయి పుట్టును. బావులు, గుంటలు త్రవ్వించి, మఱల వానిని పూడ్పించినవాఁడు మత్స్యమయి పుట్టును. న్యాయవిరుద్ధముగా నడచిన వాఁడు ఉలూకజన్మము నొందును. ఇచ్చినదాని నపహరించినవాఁడు నక్కయయి పుట్టును. రాజస్త్రీని గూడినవాఁడు నీచజన్మము నొందును. బ్రాహ్మణులకు దోషము గల్పించినవాఁడు తాఁబేటి జన్మము నొందును. మూఁడు సంవత్సరములవఱకు ద్రవ్యము తీసికొని దేవతారాధనము చేసినవాఁడును, వేదము జెప్పినవాఁడును చండాల జన్మము నొందుదురు. గనులు త్రవ్వినవాఁడును, వృక్షములు కొట్టినవాఁడును గతిలేనివారగుదురు. వాసనద్రవ్యములను దొంగలించినవాఁడు దుర్గంధ శరీరముగలవాఁడగును. పరులసొమ్ము నపహరించినవాఁడు పురుగులు మొదలగు హీనజన్మముల నొందును. యమపురమునకు బోవు మార్గమునందు చీముచేతను, రక్తముచేతను, పలువిధములగు మృగములచేతను, మొసళ్లచేతను, పురుగులచేతను నిండిన వైతరణీనదియందు కాఁచఁబడిన నేయివలె మాంసజలము పొంగుచుండును. మహాపాపములను చేసినవారికంతటికిని యానదిస్నానస్థానమగును. దేనిచేతను మనకు సమానుఁడు లేడని గర్వపడినవాఁడును, తల్లిదండ్రులను, గురువును, పురోహితుని యవమానించినవాఁడును, తన్ను స్నేహించినవానికిని, తనకు జీవనము కల్పించినవానికిని, స్త్రీలకును, బిడ్డలకును, నేత్రము మొదలగు నింద్రియములు లోపించియుండువారికిని చెఱుపు చేసినవాఁడును, వివాహవిషయమందును, బ్రాహ్మణ విషయమందును, దానవిషయమందును, ధర్మవిషయమందును విరోధము చేసినవాఁడును, బ్రాహ్మణులకు దేనినయిన వాగ్దానముచేసి, నేఁడు రేపు అని యల్లాడబెట్టినవాఁడును, పురోహితుని భార్యను గూడినవాఁడును, శ్రీమద్రామాయణ భారత భాగవతములు చదువుచోట వ్యర్థాలాపము లాడినవాఁడును, వివాహము చేయునపుడు కన్యలకు దోషములు గల్పించువాఁడును, పశువులు మొదలగు వానికి సమముగా నీళ్లను బోయక, తన పశువునకు అధికముగాను, పరుల పశువునకు కొంచెముగా బోసినవాఁడును, ఇచ్చివగచినవాఁడును, బ్రాహ్మణునికి దగిన కర్మానుష్ఠానములను చేసిన శూద్రుఁడును, కర్మానుష్ఠానములను విడచి మాంసము దినిన బ్రాహ్మణుఁడును, దైవము లేదనువాఁడును, ఎప్పుడును పరులను కోపించువాఁడును, ఇతరుల తప్పు లెన్ను వాఁడును ఆ వైతరణియందు మునిఁగి మృగములచేతను, మొసళ్లచేతను, పురుగులచేతను బాధనొందుదురు.

గరుడా! దుష్కర్మములజేయక సత్కర్మముల జేసినవాఁడు మరణము నొందిన తర్వాత స్వర్గవాసముచేసి సత్క్షేత్రమునందును, ఉత్తమకులమునందును సర్వశాస్త్రసంపన్నుఁడై, అధికధనముగలవాఁడై పుట్టి, వసియించును. తండ్రి మరణము నొందిన సమయమునందు ఆశౌచము తీఱుటకు లోగా పుత్రుఁడు ఈపురాణమును వినెనేని యాతండ్రి నిరతిశయానందస్థానమగు నాకలోకమును పొందును. తల్లి గతించినపుడు వినెనేని యాతల్లి పురుషజన్మము నొంది స్వర్గము నొందును. పితృదేవతలును సద్గతి నొందుదురు. సంక్రాంతియందును, విషువత్పుణ్యకాలమందును, గ్రహణకాలమందును, శ్రాద్ధదినమందును ఈపురాణమును చదువువారును, వినువారును, చదివించువారును అంతమందు సద్గతి నొందుదురు. వారియొక్క పితృదేవతలు నుత్తమలోకము నొందుదురు. కోటి కన్యాదానములు చేయుటచేతను, నూఱుమాఱులు షోడశ మహాదానములు చేయుటచేతను, గయాశ్రాద్ధము చేయుటచేతను కలుగు పుణ్యము ఈపురాణమును వినుటచే కలుగును. జీవులకు యమలోక భయము నివర్తిచేసి మోక్షమార్గమును తెలియజేయునది యీపురాణమే యని వక్కాణించెను. తర్వాత గరుడుఁడు పరమ కారుణ్యమూర్తియగు భగవంతుని ప్రదక్షిణము చేసి, చరణకమలములకు మ్రొక్కి, బ్రహ్మదేవునకు వేదముల నుపదేశించిన వాక్కుచేత నీపురాణమును వినగలిగితినే! ఏతపము చేసితినో! అని యానందించెను. ఆప్రకారము సూతుఁడు నైమిశారణ్యవాసులారా! పురాణశ్రవణము చేయనపేక్షించిన మీకు, నాకు దెలిసినంత చెప్పితినని శ్రీహరినామముల నుచ్చరించుచుండెను. అప్పుడు పురాణశ్రవణము చేసిన శౌనకాది మహాఋషులందఱు నానందాంబుధిలో మునిఁగి పౌరాణికుని జూచి సూతమహర్షీ! మాయందుకరుణించి యీపురాణమును చెప్పి కటాక్షించితిరి. అనేక పురాణములను తమ మూలముగా వినియున్నారము. జీవునకు దృఢమును కలుగజేయు పురాణము దీనికంటె వేఱొక్కటియుఁలేదు. బీదలగు మేము తమకేవిధముగా సన్మానింపగలమని యర్ఘ్యపాద్యాచమనముల నిచ్చి, స్తోత్రము చేసిరి. వారిలో కొందఱు పురాణశ్రవణము ఊరక చేయుటకూడదని పౌరాణికునకు కొందఱు ఘటములును, కొందఱు నారచీరలును, కొందఱు వ్యాఘ్ర చర్మములును, కొందరు యజ్ఞోపవీతములును, కొందఱు పచ్ఛలును, మఱికొందఱు దండములును సన్మానము చేసిరి, పిమ్మట అందఱును పౌరాణికుని ప్రదక్షిణ నమస్కారములుచేసి తమ తమ యాశ్రమములకు బోయిరి.

శ్రీ గరుడపురాణవచనము

ముప్పదిరెండవ యధ్యాయము.

సర్వము సమాప్తము.



